ఉస్మాన్‌పురా, కరీంనగరమునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము.

ఉమా ప్రింటర్సు, విజయవాడ-1.

# జయంతి
## 17

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.

సంపాదకులు :

విశ్వనాథ సత్యనారాయణ

జువ్వాడి గౌతమరావు

ముఖచిత్రం :

వుడ్ కట్–జగదీశ్ మిత్తల్.

సంవత్సర చందా 8 – 00

విడిప్రతి 75 న. పై.





# సంపాదకీయము

సంస్కృతభాష పోదని పూర్వము వ్రాసితిమి. పోగూడదని వ్రాయుదుమంటిమి. ఏది పోదో అది పోకూడదని వ్రాయుటయెందుకు? నిజముగా ననవసరము. కాని దానిని పోగొట్టవలెనని ప్రయత్నించెడివారుందురు. వారికి గొంతలాభము కలిగించుటకును వారి మనస్సులను మార్చుటకును వీలగునేమోయని ప్రయత్నించుటకు నిది వ్రాయవలసివచ్చును. వారి మనస్సులు మారనే మారవు నీ ప్రయత్నము వృథా యనెడివారుండవచ్చును. వారే, మా మనసులను మార్చుటకు నీ తలలోని జేజెమ్మ దిగిరావలయును అనవచ్చును. మనస్సుయొక్క స్వరూపమిదియని యెవడు చెప్పగలడు? ఏ మనస్సు నేడు పెంకెయో ఆమనస్సు రేపు మేదయగును. ఈ మనస్సు మారుటకు హేతువులిన్ని యుండుననుటకు వీలు లేదు. ఒకప్పుడు కాలము. మఱియొకప్పుడు దేశము. మఱియొకప్పుడు స్వలాభము. మఱియు నొకప్పుడు తనకువచ్చిన యాపద. వేరొకప్పుడు రాజకీయములు. ఒకటి కారణమని చెప్పుటకు వీలు లేదు. ఇద్దరొక్కయూరిలో నున్నారు. వారు పదియేండ్లక్రింద విరోధపడినారు. ఈ పదియేండ్లు మాటాడుట లేదు. పదియేండ్ల తరువాత వారిద్దరును కాశ్మీరములోనో హరిద్వారములోననో కలిసికొన్నారు. వెంటనే యొకరితో నొకరు మాటాడుదురు. ఆమనస్సుయొక్క బిగువేమైనది? దానికి కారణమేమి? ఒకడు జీవితాంతము మింకొకనితో విరోధించెను. మరణసమయ మాసన్నమైనది. ఆవిరోధివచ్చి తనకు కనపడుట తటస్థించెను. ఈ మరణశయ్యాగతుడు వానినిజూచి యిట్లున్నానని యేడ్చును. ఇది వ్యక్తిగతమైన మనోలక్షణము. ఒకడు తాను భారతదేశమునందున్నంతవరకు సంస్కృతభాషకు విరోధి. అతడమెరికా వెళ్ళెను. ఇంగ్లండు వెళ్ళెను. అచటివారు భారతదేశములో నాగరకతయే లేదనియు, భారతదేశీయులు పూర్వనాగరకతావిహీనులనియు నన్నచో నిచ్చట నెప్పుడును సంస్కృతమును తిట్టెడివాడు తాను సంస్కృతమును ప్రశంసించును. మా దేశములో వేదములున్నవి. శాస్త్రములున్నవి. పురాణములున్నవి. మీరు కన్ను తెఱవకముందే మాపూర్వులు జగజ్జేగీయమాన ప్రతిభావంతులు మొదలుగా వాదించును. ఇట్టి నైయక్తికములైన విషయములు తీసివేసినచో గొన్ని కావ్యములు తత్కాలమున లోపించును. మఱియొక కాలమున బయటపడును. వానికి ప్రశస్తివచ్చును. నేడు భాసుని నాటకములట్టివే కదా! కావ్యముల మాట యటుంచి సిద్ధాంతము లే యిట్లుండును. ఇదియంతయు మానవుని వ్యక్తిగతమైన మనస్సు, సామూహికమైన మనస్సు నివి రెండును సర్వథా యొక లక్షణము కలవిగా నుండునని చెప్పుటకు వీలు లేదని నిరూపింపగా జెప్పినాను. మానవుని మనస్సిట్టిదై యుండగా వక్రమైన యామనస్సుయొక్క యొక్కచోటు బాగుచేయవలయునన్న ప్రయత్న మెందుకు మానవలయును? అందుచేత సంస్కృతము పోరాదు అన్న విషయమునుగూర్చి చెప్పుదుము.

సంస్కృతమెందుకుపోరాదనగా సంస్కృత భాషయే పోయినచో మానవజాతి ధారుణి మీద నుండనక్కరలేదు. ఉన్నచో పశువుల వలె లేదా యర్ధపశువులవలె లేదా భాగశః పశువులవలె మానవులుందురు. సంస్కృత భాషా ప్రాధాన్యములేని జాతులిట్టివా యని యొకడన్నచో నౌనో కాదో తెలియదు. సంస్కృతభాషా ప్రాధాన్యముకల జాతులు మాత్రము మానవత్వ లక్షణసంపూర్ణమైన వని చెప్పవచ్చును.

మానవులు బ్రతుకుచున్నారు. పుట్టుచున్నారు. చచ్చుచున్నారు. ఇది యనంత కాలమునుండి జరుగుచున్నది. 'సంసారస్య అనాదిత్వాత్' అన్న మన శాస్త్రముల తాత్పర్యమిది. నేటి పాశ్చాత్య సిద్ధాంతులు వారి కిష్టమువచ్చిన లెక్కప్రకారము మానవునిసృష్టి నాలుగైదు వేలయేండ్లుకాదా పాతిక వేలయేండ్ల పూర్వము నన్నట్లుగా చెప్పుచున్నారు. ఏదైనను మానవుడు నేడు మిక్కిలి బ్రతికినచో వందయేండ్లు బ్రతుకును తరువాత నేమగును? ఏమియునుకాదు. ఇంతే. ఎవనికివాడు పుట్టుచుండును. బ్రతుకుచుండును. తినుచుండును. చనిపోవును. ఈ మానవులేమి దోమలా చీమలా? ఈమాత్రమునకు పుట్టుట యెందులకు?. పుట్టిరి. అడవిజంతువులవలె చావవచ్చును. ఈలోపుగా రాజ్యములు, రాజనీతి, బహువిషయములయొక్క విచారణ, చర్చ, ఆలోచన మొదలైన వెందుకు? పశువులకంటె మానవులయం దీవిషయములు మిక్కిలిగా నున్నవిగదా! ఆ మిక్కిలితనము వృథాయేనా? నిష్ప్రయోజనమా? ప్రాణముయొక్క స్వరూపమేమి? చైతన్యముయొక్క స్వరూప మేమి? జీవు డున్నాడా? వాడెట్టివాడు? ఆత్మయున్నదా? దాని స్వరూపమెట్టిది? ఆజీవుడుగాని, యాత్మగాని యున్నచో మానిసి చనిపోయినతరువాత నది భూతములలో లీనమైపోవునా? వానికొక వ్యక్తిత్వముగలదా ? అవిగాలిలో తిరుగుచుండునా? ఈ కాలమనంతము. ఈ యనంతమైన కాలములో జీవులన్నీ — అనంతజీవులు గాలిలో తిరుగుచుండుటయే పనియా? ఇట్టి వెన్ని ప్రశ్నలుకలవు? వీని నన్నిటినిగురించి పశువులాలోచించుటలేదు. మానవుడాలోచించెను. ఆలోచించుచున్నాడు. ఆలోచించును. ఈసర్వమైన యాలోచనలయొక్క సారభూతమైన విషయము, చర్చారమణీయమైన విషయము, తర్కితమై సిద్ధాంతింపబడిన విషయము, వేయివిధములుగా నున్నది యొక్క సంస్కృతభాషలోననే. ఆసంస్కృత భాషపోయినచో నాజ్ఞానము పోవును. ఆ జ్ఞానము పోయినచో మానవుడు పశుప్రాయుడగును. కొందరేమనవచ్చుననగా ఈసంగతులన్నియు సంస్కృతభాషలో నొక్కచోటనే లేవు. బుద్ధిమంతులైనవారు గలిగిన సర్వభాషలలో గలవని ఉన్నవి. లేవనుటలేదు. కాని సంస్కృతభాషలో నీచర్చపొందిన పరమోత్కృష్టత మఱియొకభాషలో లేదనుచున్నాము. అని మేమనుటయేకాదు. ఏ భాషలకు నట్టివారున్నారని ప్రతిపక్షి యనుచున్నాడో ఆప్రతిపక్షి యెవరిని మనస్సులో బెట్టికొని ఈమాటలనుచున్నాడో ఆతనిచేత మనస్సులో బెట్టుకొనబడినవారే వీని నంగీకరించినారు. అందుచేత సంస్కృత భాష పోరాదు.

సంస్కృతభాష పోవలయునని భారతదేశమునందు పుట్టినవారందరుగాని అభారతీయులనుటలేదు. అనుటలేదు సరికదా దానిని జచ్చెడునట్లు చదువుచున్నారు. ఈ

వికృతమనస్కులకు వారే యుపదేష్టలగుచున్నారు. ఈ యుపదేష్టలలో మొదటివాడు మాక్సుముల్లరు. ఆ మాక్సుముల్లరు లేనిచో మన భారతదేశములో నేటి యింగ్లీషు పండితులు సంస్కృతభాషలో నున్న భావములను నేటికింకెంత చంపెడివారో. వాని నన్నిటి నాయన యింగ్లీషులో వ్రాసి వీరికి తద్భాషయందలి జ్ఞానము లేకపోయినను తద్భావములయొక్క యాత్కృష్ట్యమును బోధించెను. అట్టివారు పాశ్చాత్యులెంతమందియో కలరు. అట్టివారిలో నింకొక మహాపురుషుడు సర్ జాన్ వుడ్రోఫ్. ఆయన శాక్తేయములైన గ్రంథములను పరమరహస్యమైన కామకలావిలాసమును గూడ సంస్కృతములో నచ్చొత్తించి వాని కింగ్లీషులో తర్జుమాలు వ్రాసెను. భారతదేశ రాజ్యమును గైవసము చేసికొన్న రాజకీయవేత్తలైన సైనికులైన పాశ్చాత్యులచేత మన నాగరకత యెంత భ్రష్టము కావింపబడినదో మన రాజ్యమును పాలించుటకు వచ్చిన కొందరు పాశ్చాత్యాధికారులచేత నంత సముద్ధరింపబడినది. వారిలో నధిక సంఖ్యాకులు నాశనము చేయుటకు ప్రయత్నించిన ఈ నాగరకత వారిలో నల్పసంఖ్యాకులచేత నిల్లేల యుద్ధరింపబడవలయును? ఇది సృష్టిలోని రహస్యము. మానవజాతియొక్క మనోలక్షణములోని విశిష్టత. అధిక సంఖ్యాకులిచ్చట నచ్చట నెచ్చటనైనను బ్రతుకుట జ్ఞాన రహితత్వము, లౌకికమైన స్వార్థపరత్వము, వ్యర్థాహంకారము, బాహుబలము మీదనో, మంది బలము మీదనో యొనరించెడి యకాండతాండవము బహుళమైనది. మానవుడనగా నాలోచనాపరుడు. ఆ యాలోచన యధికముగా చేయువా డుత్తమ మానవుడు. అట్టి యుత్తమ మానవుల సంఖ్యకొద్ది. వారి జ్ఞానము మీద మానవసంఘము సాగుచున్నది గాని యహంకార పూరితులైన యధిక సంఖ్యాకుల మేధాదుర్విలసనము మీద సాగుటలేదు. ఆ యల్పసంఖ్యాకులైన మహామేధావుల పరమభావనాజనిత విషయములు యోగ్యములైన వేళలయందు మూఢులైన యీ యల్పసంఖ్యాకులలో నెప్పుడో యెందుకో మార్పులు తెచ్చి వారిని బాగుచేయుచుండును. అందుచేత సంస్కృతభాష పోరాదు. సర్వ మహార్థములు సంస్కృతభాషలో నున్నవి గనుక నవి యచ్చట నుండినచే యెప్పుడో యొకప్పుడెవ్వడో యొకడు పోయి వానిని గ్రహించుటకు వీలుండును గనుక నది యొక్కటియే తరుణోపాయము గనుక సంస్కృతభాష పోరాదు.

నీవు మరుభూమి యందు నివసించుచున్నావు. వాన నీళ్ళు కూడగట్టికొని గుంటలలో నిలిపికొని నివసించు చున్నావు. అందుచేత దూరాన నెక్కడో మరోనది యుండరాదందువా? ఎనుబదియేండ్లు బ్రదుకుదువు. ఒక్కనాడైనను స్నానము చేయవు. దంతధావనము చేయవు. పచ్చిమాంసము తినుచున్న పెద్దపులివలె జూచుటకు భయంకరుడవే కాని ఈగలు నీ చుట్టును మూగుచుండును. నీవద్దకు వచ్చినచో నీకంటె దుర్వాసన వేసెడు వ్యక్తి యుండడు. ఆ పెద్దపులి తన బలమును తన లంఘనచాతుర్యమును తన దంష్ట్రాక్రూరత్వమును బురస్కరించికొని గర్జించవచ్చును. శుభ్రతను కోరెడు మృగములు కలవు. అడవిలోనున్న కొన్ని యాకులు తిని ముఖపరిశీలనము చేసికొను జంతువులు కలవు. వానికి నీరు కావలయును. అవి యేటివద్దకు పోవును. వేటకాడు పులు

లను వేటాడును. ఈ యల్ప మృగముల జోలి కంతగా పోదు. సృష్టిలోననే ఈ యధిక సంఖ్యాకులలో వైయాఘ్రమతులకు గలిగినంత యాపద హారిణమతులకున్నట్లు లేదు. అడవిలోనున్న వన్నియు వ్యాఘ్రములు కావు కదా! వాని సంఖ్య తక్కువ. అట్లే మానవుడు, సృష్టి, జీవుడు, ఆత్మ, ధర్మము, ఉపాసన మొదలైన వానిని గూర్చిన యాలోచన యధిక సంఖ్యాకులకు లేకపోయినను వారిలో చాల యెక్కువమంది తదనభిముఖులు కారు. వ్యాఘ్రము లడవిలోవలె మానవజాతిలో కొట్టుక తినెడువారు వాని కనభిముఖులు. వారి సంఖ్య తక్కువ. వారు వేటాడబడుదురు. బ్రదికినన్నాళ్ళు నటవీరాజ్యము చేయుచుందురు. వారికొరకు మహాకాంతారము నందున్న బహు జంతువులలోని సాధుత్వమే లేక పోవలయునా? అందుచేత సంస్కృతభాష పోరాదు.

సంస్కృతభాష మానవుని సమర్థించుటకే పుట్ట లేదు. దేవతలను గూడ సముద్ధరించుటకు బుట్టినది. అదిమానవ భాషకాదు. అది దేవభాష. నీభాష కానేకాదు. నీవు దానినెట్లు చంపగలవు? అది యెవరిదో భాష. వారిని నీవు నిర్మూలించినచో నాభాష చనిపోవునేమో? వారిని నీవెట్లు నిర్మూలింతువు? నీకు చేతనైనపని యేమనగా దేవతలే లేరనుట. అది యనుచునే యున్నావు. వారుండనే యున్నారు. కనపడకేమి యందువు. వారు నీకన్నులు చాలవందురు. అప్పుడొక మొండి వాదన బయలు దేరును. అది యట్లుంచి యీ దేవతలు లేరను వారుకూడా దాముకొందరు దేవతలను భావించుచుందురు. అది వారికి తెలియదు. 'బ్రహ్మా కృపాహి కేవలం. అని కొందరందురు. వీరొక మతమువారు. ఈ బ్రహ్మా కృపాహి కేవలం. అన్నమాట సంస్కృతమా తెలుగా? సంస్కృతమే. వారు సంస్కృత మక్కరలేదన్నచో నెట్లుండును. వారేమను చున్నారో వారికి తెలియదన వలసి వచ్చును.

సంస్కృతభాష అన్నమాటలో సంస్కృత శబ్దము క్తాంతము. అందుచేత కొంతమంది యది ప్రాకృతాదులనుండి సంస్కరింపబడినదని యనుకొనుచున్నారు. ప్రాకృత శబ్దము కూడ క్తాంతమే. ఎట్లుకుదురును? కనుక సంస్కృతభాషకు దేవభాషయను పేరుకలదు. మొదటి పేరదే. వేదముల యందున్న భాష దేవభాష. అది సంస్కరింపబడి కావ్యభాషకు సంస్కృతభాషయన్న పేరువచ్చినది. వేదభాష మారి సంస్కృతభాషయైనది. కాని ప్రాకృత భాషమారి సంస్కృతభాష కాలేదు. అయినచో ప్రాకృత శబ్దముకూడ క్తాంతమగుట చేతనే భాష మారి ప్రాకృతమైనది. పోనిమ్ము. నిజానికిది దేవభాష. దేవ శబ్దము దివ్ అను ధాతువునుండి పుట్టినది. దివ్ అనగా ప్రకాశించుట. ప్రకాశమనగా మానవుని పరిష్కృతమైన, తపః పరిణతమైన నిశ్చలమైన బ్రహ్మైకనిష్ఠమైన బుద్ధిలో భాసించినదన్నమాట. ఆ భాసము శబ్దము విడిగా. భావము విడిగా భాసించుట జరుగదు. రెండు నొక్కసారిగా జరుగును. దేవభాష యనగా నిది. ఇట్టిభాష పోయినచో పోయెడిది భాష కాదు. పోయెడిదేమనగా మానవునియొక్క పరిష్కృతమైన, తపః పరిణతమైన, నిశ్చలమైన, బ్రహ్మైకనిష్ఠమైన బుద్ధి. అది పోయిన తరువాత మానవుడెందులకు? అందుచేత సంస్కృతభాష పోరాదు.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు | నిశ్చల చైతన్యము

మానసమున సన్న్యాసము
వానప్రస్థంబు నిత్య వర్తనమున, నా
దైనందిన నైగమిక
ర్మానుష్ఠానంబుచే గృహస్థాశ్రమమున్.

త్రికరణముల త్రయ్యాశ్రమ
వికలముగా సంచరించు వికృతాత్ముని నా
త్రికరణముల సంధింపగ
నకటా! చేష్టాయితము మహాభారమగున్.

ఒకటి మహా జ్యోతిర్జ్వా
లికగా ప్రాదేశమాత్ర లీలాకృతిగా
ప్రకటితమై చైతన్యము
సకలంబువలెన్ మహస్సు సంధానించున్.

నా కెదియో విచిత్రమయినట్టి యొకానొక భావనాతరం
గీకృతరోమహర్షణ జిగీష వలెన్ మధురానుభూతియై
నాకు మనస్సుగాని పరిణామముగాని విలుప్తమై శరీ
రాకృతి శూన్యమై పరిసరమ్ములలో పరిలీనమై చనెన్.

—: o :—

# ఒకడు నాచన సోమన్న - 2

విశ్వనాథ సత్యనారాయణ

మహాకావ్యధ్వని యనునది తొలుత కావ్యమునం దేకవాక్యత నిర్మింపబడుటచేతగాని నిర్ణయింపరానిది. అందుచేత నీకావ్యమునందు గల భిన్నకథలను తొలుత ప్రవచించి, వానిని పరామర్శించి, వానిని నిర్ణయించి అప్పుడు గాని యేకవాక్యతానిర్ణయముచేయరాదు. ఒకకావ్యమునందలి భిన్నకథలకు—కావ్యమునందనేక కథలున్నచో—నొక యేకార్థ సమవేతత్వముగలిగినచో నప్పుడేకవాక్యత సిద్ధించును. ఈయుత్తరహరివంశమునందు ప్రథమాశ్వాసమున నరకాసురవధకలదు. రెండవ యాశ్వాసమున మొదట కృష్ణుడు చనిపోయిన విప్రకుమారులను దెచ్చి యిచ్చుట గలదు. తరువాత కృష్ణుడు తనకు సంతానమునిమ్మని శివుని నడుగుటకొరకు బోయెను. ఆమార్గమున నతని కిద్దరుపిశాచములు గన్పించిరి. వారితో గొంత ప్రసంగము సాగెను. ఆపిశాచములు కృష్ణుని పొగడిరి. ఆయన వారిలో ఘంటాకర్ణుడను వానికి నింద్రపదమిచ్చెను. శివుడు సాక్షాత్కరించి కృష్ణునకు పుత్రు నొసంగెను. ఇది ద్వితీయాశ్వాసము కథ. మూడవ యాశ్వాసమున పౌండ్రక వాసుదేవులు నేకలవ్యుడు ద్వారకను ముట్టడించుట, వారితో యుద్ధము, కృష్ణుడు పౌండ్రుని సంహరించుట మొదలైన కథలుకలవు. నాల్గవ యాశ్వాసమున హంసడిభకులకథ. ఐదవ యాశ్వాసమునుండి బాణాసురకథ మొదలు. ఐదారాశ్వాసములు రెండును బాణాసుర వృత్తాంతమే.

ఇట్లుండగా నీకథలను విచారించినచో నొకటి నరకాసుర వృత్తాంతము. రెండుమృతులైన విప్రకుమారుల వృత్తాంతము, మూడవది పిశాచ వృత్తాంతము, నాల్గవది హంసడిభకుల వృత్తాంతము నైదవది బాణాసుర వృత్తాంతము. ఈ యైదుకథలకు ప్రాముఖ్యము వచ్చుచున్నది. పౌండ్రకాదుల కథ హంసడిభకుల కథవంటిదే. కొంచెము భేదమున్నప్పటికి కథాతాత్పర్యమునందు భేదములేదు.

ఇట్లుండగా ప్రధానమైన ఈకథలయొక్క తాత్పర్యమేమి? ఈకథలే యీకావ్యమున వ్రాయబడుటయేమి? కృష్ణ సంబంధమైన బహుకథలుండగా దక్కినకథలకు నీకావ్యమునందు ప్రవేశమేల లేదు? ఐదారాశ్వాసములు రెండును బాణాసురకథతోనే నింపబడినవి. రెండాశ్వాసముల యందొక్కటే కథ వ్రాయుటయెందులకు? కృష్ణునిగురించిన కథలెన్ని లేవు? ఈ రెండాశ్వాసములుకలిసి ఐదువందల డెబ్బదియైదు పద్యములుకలవు. ఇంతపెద్దగా నాకథను పెంచుట యెందులకు? ఇంకొక కథను వ్రాయుట యిష్టములేదుకనుకనని చెప్పవచ్చును. ఎందుకిష్టములేదనగా మరియొక కథ తీసికొన్నచో తనకావ్యమునకు నేయేకవాక్యత సమకూర్పగా నతడెంచెనో యాయేకవాక్యత చెడిపోవునన్న భయముచేత నన వచ్చును. అట్లైనచో నాకథ యొకయాశ్వాసములో వ్రాసి ముగించవచ్చునుగదా! అంత పెద్దదిగా పెంచుట యెందులకు? ఒకటి కావ్యమును తగినంతపరిణాహము కలదిగా జేయు

టకు. రెండవది తన విలక్షణమైన కవితా శక్తిని ప్రదర్శించుటకు. మూడవది తాను ప్రతిపాదింపబోవు మహార్థము దీనియందధికమైన నిర్ధారణాశక్తిని గడించుకొనుననియుగుట చేతగూడను, మరియు నీకథ సర్వవిష్ణుసంబంధ పురాణములయందు ప్రసిద్ధమైనది భాగవతము నందుగలదు. మరియు శివపురాణమునందు గూడ కలదు. ఈకథ నెత్తికొని దానియందు తాను స్థాపించబోవుచున్న మహావిషయమును నిరూపించినగాని తాను స్థాపింపదలచుకొన్న మహార్థము పరిపుష్టినందదు. ఈకథయందొక వైలక్షణ్యమున్నది. బహుపురాణముల యందున్న బహుకథలు యుగాంతరీయములైన కథలు. పూర్వపూర్వకల్పము లందలి కథలుకూడ పురాణములయందుగలవు. గజేంద్రమోక్షణకథ యెప్పటిదో. ఈయుగమునకు సంబంధించినది కాదు. ఇట్లే బహుకథలు కల్పాంతరములకు సంబంధించినవి. యుగాంతరములకు సంబంధించినవి బాణాసురకథమాత్రము మొన్నటి ద్వాపరయుగాంతమునందు జరిగినకథ.

ఈ పురాణ కథలను బరిశీలించినచో వాని కాలములు వాని సంవిధానలక్షణములు చిత్రచిత్రములుగా నుండును.

తక్కిన విషయములు ప్రస్తుతము వదలిపెట్టి ఈ యైదు కథలకు ప్రాధాన్యమిచ్చి వానినే యీ కావ్యమునందు నిక్షేపించుట చేత గలిగెడి యేకవాక్యత యెట్టిది ?

ప్రతి కథను దీసికొని విచారించి దీని యర్థమిది దీని యర్థమిది యని చెప్పుచు జివరకు నేకవాక్యత యిట్లు సిద్ధించుచున్నది యని చెప్పెడు పద్ధతికంటె నేకవాక్యత యిట్లు సమకూడుచున్నదని యీ యేకవాక్యతా లక్షణమును చెప్పి యీ మహార్థమునందు నీ భిన్న కథలయొక్క యర్థములను సమన్వయము జేసినచో పాఠకునకు సులభముగా సుఖముగా నర్థము సిద్ధించుననన్న యూహతో తొలుతనే యీ యేకవాక్యతా స్వరూపము చెప్పబడుచున్నది.

ఈ కావ్యము విష్ణుపారమ్యబోధకమైన గ్రంధము. విష్ణువుయొక్క పరమస్థితియే నాచన సోమన్నయొక్క తాత్పర్యము. ఆ విష్ణు పారమ్యము దీనియందు నిక్షేపింపబడినదని చెప్పుటయందే గ్రంథగతమైన కొన్ని విషయములు తదర్థమునందు సందేహ జనయితృకములుగా గనిపించును. మొదటిది యీ కావ్యము హరిహరనాథున కంకితమీయబడుట. రెండవది యీ కావ్యమునందే రెండవ యాశ్వాసము నందలి కథయైన కృష్ణుడు తన సంతానముకొరకు శివుని గూర్చి తపస్సు చేయుట. శివానుగ్రహము లేకుండ తనకు గొడుకులు కలుగరే. ఆశివుని గూర్చి యెవడు తపస్సు చేసెనో ఆ కృష్ణుడు పరముడని చెప్పుట యెట్లు ? అన్న సందేహమా పతితమగుచున్నది. రెండవది యీ కవి అంత విష్ణు పారమ్య బోధకతా లక్షణ ప్రధాన కావ్యమును రచింప నెంచినవాడు తన గ్రంధమును హరిహర నాథాంకితము చేయుట పొసగదనియు నెవ్వడు కవి తన కావ్యమును హరిహరనాథున కంకితమిచ్చెనో అప్పుడే యీ గ్రంథము విష్ణు పారమ్య బోధకము కానేరదు అని గూడ చెప్పవచ్చును. ఈ రెండు సందేహములు నీ కావ్యమునందు చెప్పబడిన కథలయొక్క తత్త్వము పరామర్శింపబడు మార్గమునందు నివారితములగును. ప్రసక్తి వచ్చినపుడు వానిని గూర్చి చెప్పబడును.

దీనిలోని మొదటి కథ నరకాసుర వధ. ఈ నరకాసురుడెవరు ? అతనిని వధించుట యేమి ? అన్న విషయము విచారించవలయును. నరకాసురు డెవ రేమిటి ? వాడొక రాక్షసుడు అన్నంత మాత్రముతో సరిపోవునది కాదు. ఈ నరకుడు భూదేవి కుమారుడు. భూదేవికి భగవంతుడైన వరాహమూర్తికి కలిగిన సంతానము. అనగా వాడెప్పుడు జన్మించెను ? భగవంతుడు వరహావతారము నెత్తి ప్రళయ సముద్రమునుండి భూమిని సముద్ధరించినప్పుడు వారిద్దరకు జన్మించెను. వాని జన్మ యెప్పుడు జరిగినది ? ప్రళయ కాలమవసానమై ప్రళయ సముద్రమునుండి భూమి నెత్తినదెప్పుడు ? ఎన్ని యుగములకు పూర్వము ? ఎన్నికోట్ల సంవత్సరములు గడచినవి ? వాని ప్రాబల్యము ఇరువది నాల్గు మహాయుగములు జరిగిన తరువాత మొన్నటి ద్వాపరాంతమున వాని యిక్కట్టులు జగత్తునకు బలిసెను. ఈ సంగతి విచారించినచో నీయర్థము విశదము కాగలదు.

ఇచ్చట మనపురాణ కథలలోనున్న కథల యొక్క లక్షణము కొంత చెప్పవలయును. పురాణములలో నున్న కథలన్నియు కథలు కావు. కథలు కావనగా మానవ చరిత్రకు సంబంధించిన కథలు కావు. పురాణము పంచ లక్షణము. సర్గము, ప్రతిసర్గము, వంశవర్ణనము, మన్వంతర వర్ణనము, అనువంశవర్ణనము – వీటిలో వంశము, వంశాను చరితము నవి రెండే ఇతిహాస భాగములు. తక్కినవి ఇతిహాస భాగములు కావు. సర్గ ప్రతి సర్గలును, మన్వంతర కథనములును నితిహాసము లకంటె భిన్నములైనవి. వానిని కూడ నితిహాసములవలె మహాత్ములు చెప్పినారు. ఉదాహరణకు వృత్రకథ తీసికొందము. వృత్రుడనగా నహి. వాని నింద్రుడు సంహరించెను. ఆ వృత్రుడు బహు తపస్సులు చేసెను. బ్రహ్మవలన వరములు బడసెను. మొదలైన యెన్నో విషయములు వాడొక రాక్షసుడుగా నింద్రుడు దేవతగా నిరువురి నడుమ జరిగిన యుద్ధముగా గథ చెప్పబడినది. 'నహి సందేహాదలక్షణమ్, వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః' అన్న న్యాయ మొకటున్నది. ఆ న్యాయము ననుసరించి సందేహము జనించిన మాత్రముచేత నది నిజము కాదని చెప్ప నక్కర లేదు. వ్యాఖ్యానముచేత విశేష ప్రతిపత్తి భాసించుట కూడ శాస్త్రీయమైన మర్యాద. ఏ తాదృగ్దృష్టి విశేషభాస మానధిషణులకు మన పూర్వులైన వ్యాఖ్యాతలును గ్రంథకర్తలును, తత్పూర్వము నందలి బహు పురాతన కాలికములైన కథలకు తత్ర తత్ర వ్యాఖ్యాన సథములయందు విశేషార్థములను జెప్పుచునే వచ్చిరి. అట్లు వృత్రవధకథాగత పరమార్థము ప్రళయాంతమునందు పునస్సృష్టి ప్రారంభింపబోవు వేళ పంచభూతములను సమావరించి యున్న బాష్పమహాంభోధర ములయొక్క విడదీయరాని సమావరణము సృష్ట్యభిముఖీనముగా ప్రచలించుచున్న యొక విస్పష్టతారేఖా సమాధేయ శక్తిలక్షణమును మరుత్వంతునియందు కల్పించి నాటి బాష్పావృతిని వృత్రుడుగా కల్పించి చేయబడిన కథ యీ వృత్రకథ. ఈ సంగతి బహుధా మన కావ్యములయందు మన విద్వాంసులయొక్క బుద్ధులయందు నిశ్చితమైన కథయే. ప్రాసక్తికముగా నిచ్చట నింకొక విషయము చెప్పవలయును. ఈ భారత దేశ పురాణ వృత్తాంతము చాల విలక్షణమైనది. ఈ సృష్టియొక్క లక్షణము పరమ వైలక్షణ్యము కలది. దానిని గూర్చి యోజిం

చిన కొలది యిదమిత్థమని నిర్ణయింపరాకుండ నొక విషయములో మరియొక విషయము జొచ్చి గిజిగాని గూడువలె వివిక్తముగా విడివిడిగా దీయరాని యంశములు కలిసియున్నట్లు కనిపించును.

ఈవృత్ర కథావిధానము సృష్ట్యాదియందు జరిగిన సమ్మిశ్రితమైయున్న పంచభూతముల యొక్క సమాహారమైనస్థితి, పంచభూతముల యొక్క విడివిడియైనస్థితి, క్రమముగా నెట్లేర్పడినదో నిరూపించు కల్పితమైన కథయైనను- అనగా నర్థవాదమైనను అనగా మరియొక ప్రయోజనము నుద్దేశించి వేరే తాత్పర్యము భాసించుటకొరకు చెప్పబడిన కల్పితమైనకథారూపమును వహించిన విషయనిగరణమైనను దీనిలో నొకచమత్కారమున్నది. ఈకథలిట్టి వయ్యును కల్పాదియందు నిజముగా వృత్రుడను నొక రాక్షసుడు జన్మించెను. వానినింద్రుడు నిజముగా వధించెను. ఇదిగూడ విశ్వసింపదగినదే. ఇది నిజమనుటకును నాధారములుకలవు. దీనియొక్క యాథార్థ్యము నిరూపింపబడుటకు మనస్సునకు సృష్టియొక్క స్వరూపము, సృష్టిలోని లక్షణము తెలియుటకావలయును. ఇది మహారహస్యమైన విషయము. కొద్దిలో చెప్పవలయుననగాభావము రూపమును పొందుచున్నది. సంకల్పము పంచభూతమయమై రూపాంతరమునందిపంచ భూతములయొక్క వికారమైన దేహాదులను ధరించుచున్నది. ఏదియుకానిది తొట్టతొలుత పంచభూతములుగానైనది. ఈ భూతముల మొదటిస్థితి సువిభజ్యమానముగా లేదు. తరువాత సువిస్పష్టముగా విభక్తమైనది. ఆస్థితినుండి యీస్థితికి వచ్చుట సర్గకథ. ఈసర్గ కథ వట్టి మహాభూతములయొక్క పరిణామ బహుదశాభిన్నస్థితుల కథనమెట్లో అయా భిన్నదశలయందలి ద్రవ్యమయ వికారలక్షణమే తరువాత తరువాత నదే కథగా దేవతాకృతులతో మానవాకృతులతో దీపించిన జగత్తునందలి దేవయోనులయు, మానవులయు చరిత్రములుగా వారి ప్రవర్తనలుగా భాసించెను. ఇది సృష్టియొక్క పరమరహస్యము. జరిగినదే జరుగును. ఒకదానికొకటి ప్రతిబింబము. ఆకాశమునందలి గ్రహసంచారమునకు పరమేశ్వరునియొక్క లీలలకు, మానవులయొక్క జన్మలకు, వారి ప్రవర్తనలకు బింబప్రతిబింబభావమున్నది. ఇదిసృష్టి. ఎన్నికోట్ల సంవత్సరములు లోకములు గడచినను జరిగినవే జరుగును. ఒకదానికొకటి సమాధానముగా జరుగును. ఒకదానినిబట్టి యింకొకటి జరుగును. ఈసృష్టి యింత విచిత్రమైనది.

ఇంకొక కథగూడ చెప్పినచో నీ చెప్పిన విషయము విస్పష్టతరమగును. గరుత్మంతుని కథయున్నది. కద్రువ, వినతయనుగలరు. కద్రువ సంతానము సర్పములు. వినత సంతానము గరుత్మంతుడు. సృష్ట్యాదియందు కశ్యపప్రజాపతియొక్క సంతానముగా వీరు చెప్పబడిరి. అనగా నది జరిగినదని యర్థము. ఇది యిట్లుండగా కద్రూవినతలు వైదికచ్ఛందస్సులయొక్క నామములు. ఈ ఛందస్సులతో మహర్షులమృతమును సాధించలేకపోయిరి. అప్పుడు గాయత్రీచ్ఛందస్సు సముదితమైనది. దానివలన నమృతసంపాదనము జరిగినది. ఆ గాయత్రియే గరుత్మంతుడు. వినతాచ్ఛందస్సునకొక యక్షరము సంయోజించుటచేత నా ఛందస్సు పుట్టినది.

మన పురాణకథలయొక్క యర్థము తెలిసికొనుట నీరీతిగా ద్విధాత్రిధా చతుర్ధావ్యాఖ్యేయములు కాదగిన విషయములయొక్క సంయోజనముచేత నవి దురవగాహములగు

చున్నవి. కాని తెలిసికొందమన్న సౌముఖ్యము కలిగినచో బలవదల్పభావప్రతారితములు కాని మనస్సులతో జూచినచో నవియన్నియు న్యస్తముగా సామంజస్యమును బుద్ధిలో గడించుకొనుచు సమస్తముగా సృష్టియొక్క పరమ రహస్యమైన మహాలక్షణమును భాసింప జేయును.

నరకాసురవధ కథ కొంత యీదృష్టితో చూడవలసియున్నది.

(సశేషము)

—: o :—

బి. శశి | # వజ్ర సంకల్పం

వెలుగు నీడల తారతమ్యం తెలియని చీకటి లోకంలో వెలిగించబడిన జ్యోతిని చూడలేరు కొందరు. గుడ్డివాళ్ళకు వెలుగు నీడలతోనే కాదు; దివ్యజ్యోతితో కూడా పనిలేదు. కాని, మన సంకల్పం నెరవేరడమే మన ఆత్మలకు శాంతినీ, సుఖాన్నీ యిస్తుంది. అదే మనం చేసిన కార్యాలకు ప్రతిఫలంగా గుర్తించిననాడు సంతృప్తి మరింత పెరుగుతుంది.

శాంతినీ, సుఖాన్నీ ఎన్నివిధాల జీవితంలో పొందడానికి అవకాశాలున్నాయో, అన్ని విధాలా అనుభవించి లోకంనుండి పారిపోయిన వాళ్ళ గురించి తలంచడానికి కూడా తీరిక లేదు నేడు. శాంతినీ, సుఖాన్నీ మరొకరికి అంకితంచేసి, అర్పించి, వాళ్ళకు చోటు చేసి, వాళ్ళ కోరికల పక్షానికి ఓటు చేసినవాళ్ళను సర్వకాల సర్వావస్థల్లోనూ తలుస్తుంది లోకం; వాళ్లు చూపిన వెలుగు ధ్యేయంగా యీ చీకటి లోకంలో ప్రయాణం చెయ్యడంకంటే మనం చేసే గొప్పపని వుంటుందా ?

వెన్నెల వానలో తడిసి గడిచిన క్షణాలూ, గడ్డిపోచల శిరసులపై నిలబడి ఎర్రని సూర్యోదయంలో జ్వలించే మంచు ముత్యాల స్మృతులు. ఎత్తైన శిఖరాలపై నిలబడి దూరాలు పరికించినపుడు హృదయంలో యేర్పడే శూన్యాన్ని నింపే భావాల బాకులూ, జాలి గాపూలు రాలినపుడూ, ఎర్రని పెదవులపై తెల్లని నవ్వు పువ్వులు వాడిపోయినపుడూ – ఇవన్నీ గత జీవితచరిత్ర పుటల్లో నిలబడి చెదరిపోకుండా తిరిగి స్మృతిపథంలో కదులుతుంటే ఎలాగుంటుందో, రాజారావు జ్ఞాపకం వొచ్చినా అలాగే వుంటుంది.

గుండ్రంగా, పచ్చగా పెరిగి క్రిందికి జారిన బలమైన భుజాలు; ఆపైన కోలముహంలో అతుక్కున్న రెండు నక్షత్రాలవంటి కళ్ళు, వాటిచుట్టూ నల్లని అంచు; విషాదసంధ్యలోని ఎర్రని కాంతివంటి నల్లకళ్ళమధ్య తెల్లని, చల్లని చూపులు. పొడుగ్గా సాగి, అల్లే లత లాగ కాకండా, చెట్టు నాశ్రయించిన లతను చెట్టు చుట్టుకొని నిమిషాల్లో పెరిగిపోగా సాగినట్టు పెరిగిన పొడుగాటి శరీరం – ఇది రాజారావు ఆకారం.

రాజారావు జ్ఞాపకం వొస్తేనే చాలు, నాగరాజూ శకుంతలా కనులముందు కనబడతారు. నాగరాజుకీ, శకుంతలకీమధ్య రాజారావు. ఈ రాజారావు పాత్ర వీళ్ళమధ్య.

ఒకరోజున –

"వరదొస్తే బావా! నన్నేం చేస్తావ్" అని అడిగింది నాగరాజుని శకుంతల.

"ఏం చేస్తాను ?" అని, తను చెయ్యబోయే పనిని చేసి చూపాడు నాగరాజు.

"దించు నీకు మరీ సిగ్గు లేదు."

"నాసిగ్గు చిన్ననాడే పోయింది. ఆ మిగిలినది నీముందు......"

"చాల్లే ?"

"అప్పుడే మొహం మొత్తిందా ? సిగ్గు సింగారించుకొంటే, ప్రేమ పరిమళిస్తుంది. హృదయ పుష్పంలో అని అర్థం." అని, పరదొస్తే శకుంతల నెత్తుకొని ద్వీపంవంటి ఆచిన్న

లంకనుండి ఎలాగ యేరు దాటిస్తాడో చూసాడు నాగరాజు.

ఆరిపోతున్న సూర్యుని వెలుగులో నిలబడి, అంతవరకూ వాడి కిరణాలు వేడికి తలలు వంచుకున్న మిరపచెట్లు ఎర్రగా పళ్లు తొంగిచూచేలా నవ్వాయి. శకుంతల చెక్కిళ్ళనుండి, ఆరిచేతులనుండి, భుజాల వొంపులనుండి, - అనేక ప్రదేశాలనుండి అదే ఎరుపు తొంగిచూచి సిగ్గుతో తలదించుకొని, తిరిగి ఆ ప్రదేశాలను పూర్వవర్ణంలోనికి మార్చింది.

ఆ సంధ్యాసమయంలో శకుంతల పచ్చని చీరకట్టుకొని, పసుపురంగుతో పచ్చగా పెరిగిన వంగచెట్టు కాసిన తొలికాయలాగుంది. పొట్టి ముక్కు, గుండ్రని మొహంలో చెక్కిన పలచని చెక్కిళ్ళు, చెక్కిళ్ళపై గతంలోని మధురక్షణాలు గుర్తుకు తెచ్చే ఆనవాళ్ళు.

నాగరాజు తన హృదయగ్రంథం విప్పి, ప్రణయగీతం పాడి వినిపించాలనుకున్నాడు. కాని, ఆ గీతంలోని భావం అతనికే తెలియక ఆవుల్ని తోలుకొని వెళ్ళిపోతుంటే-

"వరదొస్తే బావా! నన్నేం చేస్తావ్ ?" అని అడిగింది శకుంతల.

"నీ అమ్మనీ, బాబునీ విడిచి నన్ను వెదుకుతావా? వెదికితే ఊరుకుంటారా ?" అన్నాడు నాగరాజు.

"నువ్వలాగే అంటావు! వరదొస్తే బావా ?"

"నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు"

శకుంతలకు ఆనందంగాని, విచారంగాని కలగలేదు పై మాటలు విన్న తరవాత వరదొస్తే నాగరాజుకంటే తానే ముందు నాగరాజు దగ్గిరికి వెళ్ళి తన ప్రేమబలాన్ని ఋజువు చేసుకోవాలని మాత్రం అనుకుంది.

శకుంతల ఆ యింటికి పెద్దకూతురు. సౌమ్యమైన హృదయానికి సౌందర్యం కలియగా, అరుణోదయంలోని కాంతి మెత్తని మంచు పొరలో కలిసి పరిమళించినట్టు - శకుంతల.

ఒకఉదయం నాగరాజు కొత్తగా కనబడ్డాడు. శకుంతల కనులకే కాదీకొత్తదనం; ఆరోజున వూరందరికీ కొత్తగానే కనపించాడు. పొన్నచెట్టునీడలో శకుంతల ప్రత్యక్షంకావటమో, మరోకారణమో యీ కొత్తదనం ఇలా కనబడటానికి తెలీదు. పొన్నచెట్టు పడగవిప్పిన కాళియాహిని జ్ఞాపకం తెచ్చింది. నల్లగా చల్లని నీడల్ని పరుస్తూ పొన్నచెట్టూ, చెట్టుక్రిందపిల్లంగోరు వూదుతూ నాగరాజు-నీళ్ళకోసం చెరువుకు వెళుతున్నది ఆగి, వెనక్కితిరిగిచూచింది శకుంతల. చిలిపిగా పిలిచింది పిల్లంగోరు. సిగ్గుతో అడుగులు తడబడి, శకుంతల శకుంతమై త్వరున ఎగిరిపోయింది.

నాగరాజు కారోజంతా కలతే. పగటి కలలూ, రాత్రికలలూ కలిసి అతని ఆలోచనలకు ఆధారంగా శకుంతలను చూపాయి. శకుంతల విసిరిన చిరునవ్వు కొన్ని జన్మల సుకృతాన్ని హామీ యిచ్చింది. ఎంతో కమ్మనినవ్వు. కస్తూరి ఘుమఘుమలా, పచ్చకర్పూరపు చల్లదనంలా నవ్వింది. అదే నవ్వును మననంచేసుకుంటూ ఎన్నిజన్మలైనా దొర్లించిపడవేయవచ్చు. అంత మాధుర్యం, జీవితాశాఉన్నాయి అ నవ్వులో.

ఈ నవ్వును చూచిన తరువాత నాగరాజు జీవితంలో వొచ్చిన మార్పులు స్వల్పం. శుభ్రంగా క్రాపుమవ్వుతాడు. ఉదయ సాయంకాలాల్లో శకుంతల ముందు ప్రత్యక్షం కావాలనే కోరికతో కొండెక్కి పోతుంది అతని హృదయం. శకుంతల శకుంతమై కోరి

రెక్కలువిప్పుకొని ఎగురుతూ, అతనిచుట్టూ తియ్యని తలపుల గూళ్ళుఅల్లుతోంది.

శకుంతల కనబడగానే సిగ్గు. చూపుల కడ్డంగా సిగ్గు వారధికట్టి, ఆ చూపుల నటు పార్లిపోకుండా చేస్తున్నాడు. నాగరాజును చూడగానే శకుంతల వొంటినిండా సిగ్గులు చిగిర్చి, నడకలో నానారకాల వికారాలు దొర్లుతాయి.

నీటికోసం పొన్నచెట్టుదగ్గిరనుండి వెళ్ళటం దూరమైనా మానదు.

భుజాలపై బిందె. బిందినిండా నీరు. ఆమె హృదయంనిండా ప్రేమగానం. నాగరాజు పిల్లంగోరుతో నింపిన ప్రేమగానం.

నాగరాజు చెట్టువద్గిర కనబడగానే ఎంత త్వరగా నడవాలన్నా కదలవు అడుగులు.

ఒకరోజున నాగరాజే అడిగాడు సాహసం చేసి, మాటల్లో జాలినికోరి "పాపం! బిందె మోస్తే భుజాలు......!"

శకుంతల మాట్లాడ లేదు. వెనకా ముందూ చూచింది.

మర్నాడు నాగరాజు నోటివెంట అదే మాట. శకుంతల వొంటినిండా సిగ్గు. మాట పెగల్లేదు. ఆరాత్రంతా ఆలోచనలు. నాగరాజుకు కోపం వొస్తుంది. ఇహ తనగురించి ఆలోచించకపోతే?

మూడవరోజున "మీనాయన లేడూ?" అని దీర్ఘంతీశాడు నాగరాజు.

"ఉన్నారు."

"ఎక్కడికో వెళ్ళారుట."

వొట్టి అబద్ధం, అతనికి తెలీదు.

"లేదు."

"యింటివద్దే ఉన్నారా?"

"ఊఁ!"

"వంగనాటు వెయ్యటం లేదా?"

"యీసంవత్సరం వేరుశనగ."

"వానలు పాడైపోవా?"

"తెలీదు."

"ఎందుకు తెలీదు?"

శకుంతల పెదవులపై సిగ్గుతో కూడినవవ్వు. నాగరాజు నిండా ఉత్సాహం ఉప్పెనలా.

"రేపొస్తావా? యిదికూడా తెలీదా?"

"ఎవరైనా వొస్తారు."

శకుంతల వెళ్ళిపోయింది. నాగరాజులోని సందేహాల సంకెళ్ళు విడిపోయాయి. శకుంతల హృదయంలోని మొగ్గలు వికసించాయి. ప్రతి క్షణం నాగరాజును చూడాలనే ఆతృతతో నిండినకళ్లు శకుంతలవి.

చెరువులూ, చెట్లూ, గట్లూ మనుషుల కళ్ళు తగిలించుకొని చూస్తూ, చెవులు తగిలించుకొని వింటూ వుంటాయని చూపులసర్చిలైట్లు వెలిగించి వెదికాడు నాగరాజు. ఏవో విపత్తులూ, అనుమానాలూ నిండిపోయాయి వాళ్ళనిండా.

ప్రేమించుకొనడ మెంత సహజమో, ప్రేమించుకొన్నవాళ్ళనుచూచి వెక్కిరించడం చిత్రంగా చెప్పుకొనడంకూడా అంతసహజం. తనకు చెయ్యాలనిఉన్నా శక్తిచాలక, చెయ్యలేకపోయినపుడు, ఆ కార్యం మరొకరు చేస్తే ఉత్సుకతతో చెప్పుకుంటారు మనుష్యులు. కాని, ఆకార్యంగురించి ఎంతమాత్రం వాళ్ళ మనసుల్లో లేదని పెద్దఅబద్ధం ఆడతారు.

శకుంతలను నాగరాజు ఎక్కడో, ఎలాగో, ఏదో చేశాడని ఎవరికి జరిగిన అనుభవాలను వాళ్ళు జోడించి, పేరులుమార్చి ప్రచారం చేశారు.

అయిదు దాటినా ఆరోజు సాయంకాలం శకుంతలతండ్రి పొలంనుండి రాలేదు. తమ్ముడు బడిచదువు వెలిగిస్తున్నాడు. కొంటెవెధవ.

ఏ చోద్యంకోసం చారడేసికళ్ళు విప్పుకుని ఆగి పోయాడో!

ముసురుకొంటున్న సంధ్యచీకట్లలో కూతురి భవిష్యత్తును గురించి పేకమేడలు కడు తోంది తల్లి. ఇంటివెనుక వసారాలో కూర్చుని పిలిచింది శకుంతలని. శకుంతల ఏ తలపులతో వెలిగిపోతుందో, ఆ వెలుగులకాంతి ఎంతవరకు ప్రపంచం గుర్తించగలిగిందో తెలుసు తల్లికి.

శకుంతల వచ్చింది-తల్లికి అడను చిక్కింది.

శకుంతలను అడిగింది తల్లి. లోకంలో ప్రచారంలోఉన్న కథల సంగతేమిటని శకుం తల మాట్లాడలేదు. ఆమాటలు తల్లి నోటి మీదుగా వినటానికి సిగ్గుపడుతోంది.

"పెళ్ళాడవా?" అంది తల్లి.

తల్లి యింత ఖచ్చితంగా అడుగుతుందని శకుంతల తలంచలేదు ముందెప్పుడూ.

"నాకిప్పు డేం పెళ్ళి?"

"ఎవరికీ తెలీదనుకోకు. వచ్చే విపత్తులు నీకెలాగ తెలుస్తాయి? కుర్రదానివి.

"ఏమి విపత్తులు?"

"నువ్వు చేస్తున్న పనులకేతల్లీ! ఎవరికీ తెలీ దనుకోకు. తల్లినికాబట్టి కడుపులో దాచు కొన్నాను. ఊళ్ళో పాక్కిందంటే ఎంత ప్రమాదమో తెలుసా? వాడికేం! వాడు మగ రాజు. ఆకొచ్చి ముల్లుపైని పడ్డా ముల్లొచ్చి ఆకుపైని పడ్డా ఆకుకే ప్రమాదం. మీ నాన్నకు తెలిస్తే నిన్నూ, నన్నూ ఉప్పు పాతరేస్తాడు. మానాభిమానాలు........."

ఇంకా చెప్పుకు పోతోంది తల్లి. శకుంతల విన లేకపోయింది. ఆమెకు సరిగా వినబడటంలేదు కూడాను. కంఠం పిడచకట్టుకుపోయినట్టు అయిపోయింది. తనగదిలోకి వెళ్ళి నాగరాజు తలలో తురిమిన పూలను చేతుల్లోకి తీసుకొని యేడుస్తూ వుండిపోయింది.

ఆరాత్రి శకుంతల తండ్రీ, తల్లీ సగంరాత్రి వరకూ కూతురుపెళ్ళిగురించే చెప్పుకొన్నారు. పెళ్ళి త్వరలో జరిపించడం తమ విధిగా, ధర్మంగా, న్యాయంగా భావించారు వాళ్ళు. ఎదిగిన పిల్లల తల్లిదండ్రులంతా పెళ్ళి జరి పించడం తమ బాధ్యతగా భావించినందు కే నేమో యిన్ని ఘోరాలు మిగిలిపోయాయి సంసారాల్లో. కాని, తన కక్కర లేని పెళ్ళి, తన కక్కర లేని న్యాయం, తన కక్కర లేని ధర్మం వీళ్లెందుకు కల్పించాలి? స్వాతంత్ర్యంగా భావించే యిన్ని సంవత్సరాల అనుబంధాన్ని సరకంగా మార్చడానికి ఎవరికి అధికార మున్నది? ప్రతిక్షణం బాధతో, యాతన లతో, ఘోరమైన భరించరాని ఊహాలతో జీవితాంతం వేధించి, శోధించే పెళ్ళి ఎంత పవిత్రబంధం?...... శకుంతల ఆలోచనల్లో మునిగిపోయింది. ఒక్క ప్రశ్నకీ సమాధానం దొరకలేదు. తరతరాలనుండి అలవాటూ, సంప్రదాయం అనే రెండు పట్టాలపైని మంచి చెడ్డలనే రెండు జండాలననుసరించి నడచిన రైలుబళ్లు మన సమాజాలు.

సంభాషణల సాగరంలో మునిగి, చివరికి తల్లీ తండ్రీ నిద్రపోయారు అలసి.

తలుపులు వారగా తీసింది శకుంతల. వెనక్కి వచ్చింది. చూచింది గదిలోనికి. గాఢనిద్రలో తల్లీ తండ్రీ — దీపంకొండి దించింది. దివ్యానుభూతిలో తేలింది. భయం! మరొకడుగు ముందుకు వేసింది. వెనకా ముందూ ఎవరో వొస్తున్నట్లు......భయం! దీపంకొండి పెద్దది చేసింది.

ప్రక్కమీద తమ్ముడు పుస్తకం గుండె లపై వుంచుకొనే నిద్రపోతున్నాడు.

దీపంకొండి చిన్నది చేసింది.

శకుంతల గదినుండి వెలుపల పడింది.

చీకటి.

ఆకసం అంధకారం కక్కుతోంది.

చెట్లూ, గట్లూ, చీకటిలోనే కలిసిపోయాయి. ఊరుకు దూరంగా ఉన్న నాగరాజు యింటికి వెళ్ళి తెలియజేయాలి తల్లిదండ్రుల నిశ్చయం. రాత్రి. ఫర్లాంగుదూరం. భారమైన పని. త్వరత్వరగా నడవబోయింది.

ఎవరో కొంగు పట్టుకొన్నారు.

ఎవరు?

అదురుతున్న గుండెల్ని రొమ్మును అదుపులో పెట్టలేక బాధపడుతున్న పమిటి కొంగు బిగించి అదిమింది. విడిపించుకు నడిచింది. ఒడలంతా వొణికింది శకుంతలకు. తిరిగి కొంగు పట్టుకు లాగినట్టు అనిపించి, వళ్లంతా వొణికింది. ఎవరో ఆమెని వెంటాడుతున్నారు. చీకటిలో మరింత దూరం వెళ్ళిన తరువాత.

ముందు వెనుకలకు పరీక్షగా చూచింది. దారి కిరుప్రక్కలా బర్రింకడొంక లున్నాయి. ఆ డొంకలే ఆమె కొంగును పట్టుకులాగాయా? ఆ డొంకల వెనక్కి వెళ్ళిపోయాడా?

భయంతో మరోదారికి తప్పుకుని తిరిగి వొచ్చి, రాని నిద్రకు కళ్ళను బానిసలుగా చెయ్యాలని ప్రయత్నిస్తూ, కాలాన్ని ఖర్చు చేస్తూనే వుండిపోయింది శకుంతల.

ఆ మర్నాడు నీళ్ళకు వెళ్ళవద్దని చెప్పింది తల్లి. శకుంతల విననట్టు వెళ్ళింది. ఈ వార్త సతనితో చెప్పాలని తప్పితే, మరో ఆలోచన లేదామెకు. కాని, పనిగట్టుకు వెళ్ళినా నాగరాజు కనబడలేదారోజున. ఇంటివరకూ తెచ్చిన నీరు వాకిట్లో వలకబోసి, జారిపోయానని చెప్పి తిరిగి వెళ్ళింది. రాజారావుతో మాట్లాడుతున్నాడు నాగరాజు.

రాజారావును చూస్తే శకుంతలకు వారం రోజులుగా కోపం వొస్తుంది. కొంటెచూపులు విసురుతూ, తుంటరిమాటలతో గాయపరుస్తున్నాడు శకుంతల హృదయాన్ని. చదువుకొన్నవాడు. పరాయి స్త్రీ వెళుతుంటే తుంటరి మాటలంటూ, కొంటె చూపులు చూస్తూ సౌందర్యాన్ని ఎక్సరే పరీక్ష చెయ్యకూడదని తెలీదా? ఆ రాత్రి తన కొంగు పట్టుకులాగినపుడే శకుంతలకు అనుమానం కలిగింది. ఆ నాటకంలో నీచపాత్ర రాజారావుది. ఇలాంటి సమయంలో నాగరాజు దగ్గిరికి వచ్చినందుకు బాధపడింది.

"మీ ఆవిడ నీకోసం వచ్చినట్టుంది!" అన్నాడు రాజారావు. ఇంకా పోలేదు వాడికా పాడుబుద్ధి. శకుంతలకు సిగ్గూ, రెండు రోజులుగా మనసులో మండుతోన్న కోపమూ ఒక్కసారి మాటలరూపం దాల్చాయి.

"మిమ్మల్ని చెప్పమనలేదు." అంది.

"అయితే మానేస్తాలెండి." అని రాజారావు...

"మీ కనవసరం."

"ఉన్నమాటంటే ఎవరికైనా ఉలుకే కదురా తంబీ!"

నాగరాజు పిలిచినా, ఆగకుండా వెళ్ళిపోయింది.

వాళ్లకు మాత్రమే, కాలం అతిభారంగా సాగుతోంది. ఒక నెల గతించిపోయింది. ఈ నెలరోజుల్లో యీకథకు సంబంధించిన ముఖ్య విషయం మరింత ధృవపడిపోయి, ప్రచారంలో తన స్థానాన్ని నిర్ణయించుకుంది. శకుంతలకు పెళ్ళిబేరాలొచ్చాయి. డబ్బున్న వాడు. చదువు వున్నవాడు. రూపు రేఖావిషయాల్లో ఏ లోపం లేనివాడు. అందంలో అమరిన ఆనందంలా, వీటన్నిటికీ తోడు సుగుణసంపత్తి. శకుంతల తండ్రి యీ సంబంధమిలా కలిసి వస్తుందని కలలోకూడా అనుకోలేదు.

కుర్రాడు తన యింట్లో, తల్లి దండ్రులతో పోట్లాడి మరీ వొచ్చాడు కట్నం కాసుకూడా పుచ్చుకోనని. స్వరక్తమాంసాలు కుర్రాళ్లు అమ్ముకొంటున్న రోజులు. ఎంత గొప్ప విషయం!!

శకుంతల తండ్రీ యీ సంబంధాన్నే నిశ్చయంగా నిర్ణయించు కోవాలనుకొన్నాడు. శకుంతల తల్లిదగ్గిర గోలపెట్టింది.

"నాకు పెళ్లివద్దు" అని.

పెళ్లే వొద్దా? లేక యీ పెళ్లిమాత్రమే వొద్దా? అని తల్లి -

"నా కసలు పెళ్లివొద్దు."

"ఎందుకని?"

"నా కిష్టంకాదు. నీకిష్టంగానిపని నిన్ను చెయ్యమంటే చేస్తావా అమ్మా"

"బాగుకోరి చెప్పినపుడు తప్పదు."

"నాబాగు నాకు తెలియిదా యిన్నేళ్లు గడిచాక?"

"ఎవరి బాగు వాళ్లు గుర్తించలేరే తల్లీ!"

తల్లి వినిపించు కొనేటట్టులేదు. చివరికి ఒక రోజున సాహసంచేసి, వొస్తున్న దుఃఖాన్ని మింగి తండ్రి దగ్గిర చెప్పింది నాగరాజునే చేసుకుంటానని. తండ్రి ఆశ్చర్యంతో మాట్లాడ లేకపోయాడు. మగవాడైవుండి, తనపెళ్లిని గురించి తనే చెప్పుకొనలేక, ఆ పేరు వినగానే సిగ్గుతో తడిసి, ఒడిసిపోయాడప్పుడు. ఇప్పుడు అనంతరం — ఒక స్త్రీ - తన నిర్ణయాన్ని తెలియజేస్తోంది.

కల్పాంతంలో వైపరీత్యాలనేకం జరుగుతాయన్నారు. వాటిలో యిదొకటిగా లెక్క కట్టాడు. కాని, మనకంటెముందు చూపుతో తెలిగే వాళ్లనీ మన కర్థంకాని విషయాలనీ కించపరుస్తూ ఎన్నో మహత్తర సత్యాలతో పాటు మహాత్ముల్ని కూడా తరతరాలనుండి మన అజ్ఞానానికి ఆహుతిచేస్తున్న మానవులం మనం.

ఈ చుట్టరికం పోయిందంటే పెళ్లిసంబంధాలిక రానే రావన్నాడు తండ్రి. తల్లి దండ్రుల ఆశయం కేవలం శకుంతలకి వెంటనే పెళ్ళి చెయ్యటమే కాబట్టి శకుంతల మాట్లాడ లేదు తిరిగి.

అనుకొన్నట్టే నాగరాజు ఉదంతం వాళ్ల చెవుల వరకూ నడిచింది. అక్కడితో ఆగి పోతుంది సంబంధం అను కొన్నారు. కాని, కుర్రాడేపట్టు పట్టి ఆ అమ్మాయినే చేసు కుంటానని గోల —

ఉభయత్రా అంతా వప్పుకున్నారు. కొన్ని రోజుల తరవాత మాత్రమే ఆ శుభ ముహూర్తం.

వరుడు రాజారావు

వధువు శకుంతల.

నాగరాజు స్నేహితుడు రాజారావు. పొన్న చెట్టుదగ్గిరనిలబడి నాగరాజు శకుంతలను పిలవటం చూశాడు. తననోటితో తానే స్వయంగా అన్నాడు. ఇప్పుడేమిటీ దారుణం? శకుంతల ఆరోజున నాగరాజు ముందు కించ పరచిందని కోపమా? పగబూనాడా? ఒక్క మాట కోసం ఒక జీవితాన్ని, నిండు జీవాన్ని బాధలపాలు చెయ్యాలని తలంచితే; ఎన్ని మాటలు పొందిన బాధని పోగొట్టి, పోయిన జీవిని తిరిగి బ్రతికించగలవు?

రాజారావు పెళ్ళిబేరాలు జరిపి, తనతో సంబంధం ఖాయం చేసుకున్నాడని తెలియ జేసి, తన్ను రక్షించుకోమని చెప్పాలని వచ్చింది శకుంతల.

"బావా! వందొస్తే నన్నేం చేస్తావ్?" అని అడిగింది వెళ్ళిపోతున్న నాగరాజుని వెనక్కి పిలిచి.

"ఇప్పుడేమి వరద ?" అన్నాడు.

"నిన్న చూడలేదా ? కొద్దిగా పొంగింది గోదావరి. పౌర్ణమి దగ్గరపడుతోందిగా ?"

"అపుడు ఆలోచిస్తా. చీకటి పడుతోంది. ఎవరైనా వస్తారు."

"కష్టాల వరద !"

"నా ప్రేమను నావ చేసి, దాంట్లో కూర్చోబెట్టి నిన్నెత్తుకుపోతాను." అన్నాడు; తన ఆనందబాష్పాలు పువ్వులుచేసి శకుంతల ఒడినిండా నింపుతానని చెప్పటం మరిచిపోయి.

"రాజారావు నన్ను పెళ్ళాడతాడట."

"కల్ల !"

"నిజం !"

"వాడి మొహం ! నిన్నేడ్పించాలని."

"లేదు. నాన్నతో ముచ్చటించి పోయారు వాళ్ళ పెద్దలు. కొద్దిరోజుల్లోనే ముహూర్తమట. నన్ను రక్షించవూ ?"

"నీకెందుకాపిచ్చి ? రాజారావు నాకు ప్రాణమివ్వమంటే యిస్తాడు."

"లేకుంటే చస్తాడు."

"శకుంతలా. ఏమిటామాటలు ?"

"నేనెప్పుడో అనుకొన్నాను నువ్వు యిలాగ చేస్తావని. మా తమ్ముడొస్తున్నాడు. బిందె పొన్నచెట్టుకొమ్మకు తగిలించి వచ్చాను. అని, శకుంతల వెళ్ళిపోయింది.

శకుంతల మనసులో ఆపదలు వరదలై పొంగుతున్నాయి. రానున్న విపత్తును గురించి నాగరాజు పట్టించుకొనటం లేదు. ఏం చేసినా తానే స్వయంగా చెయ్యాలి. అంతా ఆమెదే భారం. దుఃఖం వచ్చింది శకుంతలకు.

శకుంతల తమ్ముడొచ్చి "మా అక్కేది బావా?" అని అడిగాడు.

"మీ అక్కదగ్గిర నన్ను కాపలాపెట్టావా?"

"మా అమ్మ పిలుచుకు రమ్మంది."

"నాదగ్గరుంటాదని చెప్పిందా?"

"... ... ... ..."

"మాట్లాడవే ? మూతికి మిరపకాయ రాయాలా?"

కుర్రాడు వెళ్ళిపోయాడు తిరిగి మాట్లాడకండా.

శకుంతల ఆ సంధ్య చీకటిలో ఎత్తుపల్లాల నంటిపెట్టుకొని వేళ్ళాడుతున్న పచ్చనిచీరతో, విషాదభారంతో కుంగిపోయి, రోజూ మోసే బిందెనే హిమాలయాలు మోస్తున్నట్టు మోస్తూ వెళ్ళింది.

ఆ వెనకే తమ్ముడు—

నాగరాజు పిల్లంగోవి స్వరంపెంచి విషాదం చీకటితో మూటకట్టి శకుంతల గుండెలపై మోపుతూ దూళ్ళపాకవైపు—

౨

శకుంతల పెళ్ళిప్రయత్నాలత్యుత్సాహంగా సాగుతున్నాయి. లంకలోని గుమ్మడికాయలు రెండు పెళ్ళిళ్ళకు సరిపడా ప్రోగు చేశాడు తండ్రి. ఆనాటికీ యిస్తానన్న విస్తళ్లు కనీసం అయిదు పెళ్ళిళ్ళు చెయ్యవచ్చు. తల్లి మనుగుడుపు అల్లుడికి చెయ్యవలసిన సత్కారాలగురించి దశదినప్రణాళిక తయారు చేసింది. సున్నితాలూకు కీర్తిఘుమాయిస్తోంది. దూరపు బంధువులు కొందరు జేరారు. ఇహ రావలసినది ముసలి మేనత్త. ఈవృద్ధవనితకెందుకో యీ పెళ్ళిజరపటం యిష్టంలేదు. ఆమె రాకపోవటానికి అదేకారణమో, నీరసపడి రాలేకపోయిందో విచారించే తీరికకూడా లేదు శకుంతల కుటుంబానికి. చిన్నప్పుడే శకుంతలను తన పుత్రుడికి యివ్వవలసిందిగా కోరింది. పేదరికం పెళ్ళిప్రయత్నాలనేకాక,

బంధుత్వాల బంధాలుకూడా సడలించింగి. ఆయిల్లు చిన్నసైజు సత్రంలా తయారయ్యింది.

శకుంతల కీప్రయత్నాలుచూస్తున్నప్పుడూ ప్రతిక్షణం హరించిపోయి, ఆముహూర్తం దగ్గిరపడుతున్నట్టు జ్ఞాపకంవచ్చినప్పుడూ తనపై తనకే కోపంవస్తుంది. నాగరాజు అప్రయోజకుడని తిడుతోంది. ఆత్మహత్యా ప్రయత్నాలు తలుచుకొని ఆనందవిషాదాల మధ్యపడి నలిగిపోతుంది. రాజారావును ఎవరో చంపెయ్యాలనీ, ఏదేవతో ఎత్తుకు పోవాలనీ ఆలోచిస్తుంది.

చెరువులో ఉరికీ, పీకకురి బిగించుకొనీ, - ఎన్నివిధాల ప్రాణాలు పోగొట్టుకొనడాని కవ కాశాలున్నాయో ఆలోచించింది.

శకుంతలకి సాహసం రెక్కలై మొలిచింది.

ఆరోజు ఆదివారం. దూరంగా నది చీకటిలో రహస్యమంతనాలు చేస్తోంది. శకుంతల ఆత్మ నారోజుకు తెచ్చి తన గర్భంలో నిద్రపుచ్చమని దాని కోరిక—అంతా భోజనాలు ముగించారు. లంకంతా చీకటిని పరిపాలిస్తోంది. శకుంతలతండ్రి, పెళ్ళిప్రయత్నాలెంతవరకూ ముగిశాయో చెబుతున్నాడు భార్యకి.

తన గదిలో కూర్చుని, ముడి విప్పుకొని భయంకరంగా ముందుకు వాలినజుట్టు నెనక్కు సవరించుకొంటూ నాగరాజెంత అప్రయోజకుడో ఆలోచిస్తో, ఆత్మహత్యా ప్రయత్నంలో నిమగ్నమైనది శకుంతల.

ఎక్కడైనా, ఎన్నడైనా ప్రేమ పిరికితనాన్ని ఎరుగునా? కష్టనష్టాలను కావడి కుండలుగా మొయ్యకుండా ప్రేమ యేనాడైనా గమ్యస్థానం జేరగలిగిందా?

"ఎంతపని జరిగిపోనాది. శకుంతల వొప్పు గుందిట!" అంటుందొక ముత్తైదు.

"నాగరాజుకేనా ఏడదిబుద్ధి?" అంటే -

"నాగరాజు కెందుకునే. రాజనావుగాడికేది బుద్ధి?" అని మరొకరు.

"ఎంగిలికూడు."

ఎంతమాట! లంకంతా రంకె వేస్తోంది శకుంతల కథ విని. శకుంతల హృదయపాత్ర సూటి, పోటి మాటలనే బండరాళ్ళపైబడి బ్రద్దలైపోయింది. దివ్యపుష్పాలను పన్నీటితో కడిగి శుభ్రపరచా లనుకునే ఛాందసం వింతలూ, విచిత్రాలూ కలిపింది వీళ్ల ప్రేమకి. అవికూడా కలిపితే యీ కథకు రెక్కలు మొలిచి, భూనభోంతరాళాల్లో ఒకేకాలంలో సంచారం చేసి వుండేది. సినీమా లైలా మజ్నూలవలె చచ్చి పై కెగిరిపోయేవారు కాని -

ఎందుకూ కొరగాని, యిద్దర్ని లేపుకు పోయిన నూరి అంటోంది -

"నీతినీమాలు నిలువునా నీరైపోనాయి నిప్పంటి మనుసులికి శద పట్టింది."

"అంతే! ప్రేమించుకొనోళ్ళని పేసంలో యేపి పడయ్యాలె." అంటుంది మూడోవాడి కోసం గాజులు బ్రద్దలు కొట్టుకొన్న వృద్ధనారీ......

పైమాటలైనా వినబడటంలేదా రాజారావు పాడు చెవులకు! శకుంతలను మరిన్ని బాధలపాలు జెయ్యడానికి పెళ్లాడుతున్నాడా పంతంపట్టి?

శకుంతల ఆలోచిస్తూ వుండలేకపోయింది. తల్లీ తండ్రీ జ్ఞాపకంవచ్చి, తాను చనిపోతున్నట్టు తలంచుకొని బాధతోనూ, కోపంతోనూ వొణకింది. ఆ చీకటిలో చెరువు

వైపున నడిచింది చావాలని. బిందెను మెడకు కట్టుకొని, దానినిండా నీరు నింపుకొని ఉరికితే మరిక లేచి రాలేదు. అందుకే బింది కూడా పట్టుకు వెళ్ళింది.

చెరువు సమీపాన, అరటిచెట్ల గుబురుల వెనక ఉన్న పొన్న చెట్టుక్రింద నిలబడి రాజారావూ, నాగరాజూ మాట్లాడుకొంటున్నారు.

'ఎవరక్కడ?' అని ప్రశ్నించాడు పొన్న చెట్టునానుకొని నాగరాజు.

'మీ ఆవిడకాబోలు.' అన్నాడు రాజారావు.

పెళ్ళి మరిక రెండురోజులేవుంది.

ఇంత తతంగంనడపి, ఎంత కపటనాటకం! శకుంతల హృదయం పరాభవాగ్నితో భగ్గున మండింది. దుఃఖంగాదు. కోపంగాదు. ప్రతీకారవాంఛ. తనకు తానే దగ్ధమైపోయి మరెవరినో వంచించాలనే వాంఛ అది. వాళ్ల దగ్గిరికి వెళ్ళింది. పెదవులు వొణికాయి. ఆ హృదయంలోని మంట మాటలరూపందాల్చింది. అడుగులు తడబడ్డాయి. మాటల్లోని శబ్దాల పొందిక భయపడి వొణికింది.

'నీకు బుద్ధివుందా? అని అడిగింది.

'ఎవరికి?' అన్నాడు రాజారావు వెనక్కి జరిగి.

'ఎవరికి?' అన్నాడు నాగరాజు.

శకుంతలబోరుసయేడుస్తూ వుండిపోయింది. 'నీకు తెలీదు శకుంతలా! రాజారావు మంచి వాడు.' అన్నాడు నాగరాజు.

'నన్ను నీమెడకు గుదిబండను బిగించినట్టు బిగించకుండా చేస్తున్నాడు. నువ్వు మరొకర్ని వెంచనక్కరలేదు. 'అని యేడుస్తూ తిరుగు మొహంపట్టింది శకుంతల.

'చెప్పెయ్యి.' అటాడు రాజారావు.

'ఆడవాళ్ళ నోట నువ్వుగింజ దాగదు.' అని నాగరాజు—

ఏప్రయత్నంతో వచ్చిందో, ఆప్రయత్నం నెరవేరలేదు. ఇంటికి తిరిగి వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్లేసరికి తల్లీ, తండ్రీ హడావడితో ఉన్నారు. దొడ్డీ,దూలాలూ,యింటిచూరులూ వెదుకుతున్నారు శకుంతల శవమై వేళ్ళాడు తుంటుందని.

శకుంతలను చూచి తల్లిగాని, తండ్రిగాని మాట్లాడలేదు. తమ్ముడుమాత్రం ఎందుకో అక్కను కౌగలించుకుని యేడ్చాడు. వాడు యేడుస్తుంటే శకుంతలకీ దుఃఖం ఆగిందికాదు. వాడెందుకేడుస్తున్నాడో వాడికే తెలీదు. తల్లీ తండ్రీ ఆరాత్రంతా కాపలా కాస్తూనే వున్నారు.

శకుంతలను పెళ్ళినాటివరకూ యింటి గడప దాటకుండాచేసి, బ్రతికించారు. కాని, ఆమెలో పూర్వపు ఉత్సాహంగాని, ఆసౌందర్యంగాని లేదు. కళ్ళు గుంటలుపడి, నల్లని చారికలేర్పడి వయసులో పెద్దతనాన్ని, శరీరం చిక్కిపోయి అనారోగ్యతనీ సూచిస్తున్నాయి.

పెళ్ళిముహూర్తం సమీపించింది. ముత్తైదులు అలంకరిస్తున్నారు శకుంతలను. పెళ్ళి పందిరినిండా గోల. వంటలు వడ్డించుటకు తింటున్నవాళ్ళగోల. గోల! గోల! ఈ గోల అంతటా నిండిపోయింది.

'పెళ్ళికొడుకేడి?'

'దారిలో ఆగాడు. కొంచం వెనకా ముందూ...'

'అబ్బా! యీ కాలపు కుర్రకారుకు చెప్ప లేక చస్తున్నాం.'

'చెప్పలేక మీరు చావడమెందుకు?వాళ్ల మానాన వాళ్ళని బ్రతకనివ్వరాదూ?'

'అదికాదయ్యా! ముహూర్తం దాటిం దంటే దుర్ముహూర్తం. మరో రెండు గంట లాగితేనేగాని జాతకునికి సరియైన నక్షత్రఫలం కుదిరిరాదు.' అంటున్నాడు పురోహితుడు.

'ఓరబ్బో! కీర అరటికాయల కూరలా గుంది.'

'మజ్జిగా లేక మంచినీళ్ళా నాయనా యివి?'

'నెయ్యి వడ్డించినట్టు వడ్డిస్తావేమయ్యా చారు.'

'పప్పుకు కంట్రోలా! ఉప్పు దట్టంగా కలిపారు.'

"యిదేమైనా ఆవగాయ పచ్చడను కున్నారా బావగారూ! గుమ్మడికాయ దప్పళంలో లంక మిరపకాయలిలాగ దట్టిం చారు?"

"ఏమండోయ్! నేనిక్కడున్నానని మీ కెవరూ 'చెప్పి' పంపించలేదూ?"

"అదేదో మొన్న మీ దవడమీదికే వచ్చిందటగా మహానుభావా?"

"మరదలుపిల్లలా సిగ్గుపడుతూ వడ్డిస్తా వేమయ్యా పప్పు? వడ్డించు! ఊఁ! తగలనియ్."

తింటున్నారు. తిరుగుతున్నారు. పెళ్ళి కొడుకును గురించి అలజడి చేస్తున్నారు. పరిహాసాల పన్నీరు జిమ్ముకుంటున్నారు. నవ్వులు. ఎంతో కాలానంతరం కలుసుకున్న వాళ్ళ కౌగిలింతలమధ్యపడి నలిగిపోయిన యెడ బాటు. గతస్మృతుల్లో, ప్రథమసమాగమాల్లో జరిగిన అనుభవాల పునర్దర్శనం ఊహల్లో.

ముహూర్తం దాటిపోయింది. రాజారావు-పెళ్ళికొడుకుమాత్రంరాలేదు. గంటలుకాదు, పూటలుకాదు- రోజే దాటిపోయింది. రాజా రావు తండ్రిని తిట్టారు. రాజారావు కన బడతా డేమోనని వెదికారు. కనబడితే తన్ని తీసుకొచ్చి పెళ్ళిచెయ్యాలని తలంచారు. వెదికారు. కాని, కనబడలేదు. శకుంతలకు ఆనందంగానే వుంది గాని; తల్లీ, తండ్రీ మాత్రం అవమానంతో సగ మైపోయారు. శకుంతలకు మరో సంబంధం రానేరాదు. ఇంత జరిగిన తరవాత తిరిగి మరో సంబంధం ఎలాగ వస్తుంది? శకుంతల జీవితాన్ని నాశనం చెయ్యాలని యిలాగ దగా చేశాడని ఆడిపోస్తోంది లోకం.

నాగరాజు కనబడితే యిప్పటికైనా బుద్ధి తెచ్చుకోమని చెప్పాలని తలంచింది శకుంతల. కాని, శకుంతల కదలకుండా తల్లి కాపలా కాస్తుంది. ఎటూ కదలనివ్వదు. ఆమె మునుపటి మనిషి కాదిప్పుడు. చిక్కిపోయింది. ముఖాన్ని గుండ్రంగా మలిచిన చెక్కిళ్ళు పలచబారిపోయి కోలముఖాన్ని మిగిల్చాయి. లేగదూడ పాలు కుడుచుకోకుండా మూట్టికి బుట్ట తగిలించినట్టే, శకుంతలకు కాపలా.

రోజులు యథావిధిగా, యిరవైనాలుగు గంటలలోనే గడిచిపోతున్నాయి. కాని, యీ లంకప్రజల జీవితమే మరీ నికృష్టమైపో యింది. వరదలొచ్చాయి. వరదలొస్తే జీవ న్మరణాలమధ్య సంకులసమరం. శకుంతల యిల్లు యేటిగట్టంత ఎత్తుగానే వుంది. దానికి నష్టం రాదు. కాని, నాగరాజు మరీ పల్లంలో కట్టుకొన్నాడు యిల్లు. అతను గుత్తకు చేస్తున్న తోటలో, వంటరిగా గడుపుతు న్నాడు కాలం. వరద వస్తే మొదట అయిం ట్లోకే దారి తీసేది. ఎలాగున్నాడో? శకుం తలకు జాలి, జాలినిమించి ప్రేమాపొంగాయి. నాగరాజు సుఖంగా వుండి, రాజారావు మాత్రం శవమై వరద గోదావరిలో కొట్టుకు పోతున్న అనేక కట్టెలమధ్య పడి తేలిపోవా లని కోరుకొంది.

"వరదొస్తే బావా! నన్నేంచేస్తావ్ ?" అని అడిగింది అప్పుడు.

"నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు-అయినా మీ అమ్మనీ, బాబునీ విడిచి వస్తావా ?" అని అడిగాడు నాగరాజు. ఎంతకైనా నాగరాజు వట్టి అమాయకు డనిపించింది శకుంతలకి. అమాయకుడు కాకుంటే వస్తున్న విపత్తును గురించి విప్పి చెప్పినా వినకుండా, శత్రువు మాటలు నమ్మి యిలా మోసపోతాడా ?

ఆలోచిస్తూకూర్చుంది శకుంతల. తమ్ముడు వరదలగురించి బడికి వెళ్ళడానికి వీలుగాక, తండ్రితోపాటు పడవలో కూర్చుని తోటలు చూచి వస్తున్నాడు. వాడు తిరిగి తిరిగివొచ్చి "అక్కా! నాగరాజిల్లు కూలిపోయిందే!" అన్నాడు.

శకుంతల నిజమేనా అని అడిగింది. వాడు నిజమేనని వట్టేసుకుచెప్పాడు. ఎంతదుర్వార్త విన్నది శకుంతల! ఆ గుడిశలో, నీటిమధ్య, ఊపిరాడక నాగరాజు ...... తనకింక యీ జీవిత మెందుకు ? వరద! వరద !! విషాదాంబుధి పొంగి, శకుంతల గుండెనే ముంచి, తేల్చి, కొట్టుకు పోతున్న వరద. ఎదిగిన చెట్టను ముంచి, అడ్డం నిలబడ్డ గట్లను ధిక్కరించి, దూరాన్ని పరికిస్తూ సాగిపోతున్న వరద. లెక్కలేని జంతువుల్నీ, అంకెలకందని జీవాలనూ పొట్టను పెట్టుకొని పోతున్న వరద. వస్తున్న వరద. లంకనిండ వరద పొంగి వన దేవతలతో చర్లాట యాడుతోంది.

గతమంతా మండి, కాలి, రాలి, హృదయాన్ని ప్రమోదుగా చేసి దండిస్తోంది.

తల్లీ, తండ్రీ వీధి అరుగులపైని కూర్చుని, గృహప్రవేశం చెయ్యలేక, గోడల్ని కరగదీసుకొంటున్న వరదను చూస్తూ; ఇంత పెద్ద వరదను ముందెప్పుడూ చూడలేదని చెప్పుకొంటున్నారు. శకుంతల దొడ్డివైపున, వంట వసారా దగ్గిర నిలబడి, నాగరాజు యింటివైపు వెళ్ళే నావలకోసం ఎదురు చూస్తోంది. వెళ్ళాలి నాగరాజుదగ్గిరికి అత నెలా గున్నాడో చూడాలి. అదే ఆమె ఆలోచన. యింకా జీవించి ఉన్నాడా యింత వరదలో ?

"ఎవడికోసమే, అలాగ వెదుకుతున్నావ్ ?" అని అడిగింది శకుంతల తల్లి.

శకుంతల పరాభవాగ్నిలో, కోపంతో మండిపోయింది. బంతిని అదిమేకొద్దీ పైకి లేస్తుంది. తనూ అంతే. ఎంతమాట అనేసింది! "నీకోసం వచ్చేవాడికోసమేనేఅమ్మా!" ఇంత మాట అన్నతరవాత యేతల్లీ సహించలేదు. కాని, ఆ సంబంధం, ప్రేమ అంత బలమైనవి ప్రకృతిలో. అందరినీ ధిక్కరించే శక్తిగలవి.

శకుంతల తల్లి యేడుస్తూ భర్తతో చెప్పింది.

"విన్నారా దీని మాటలు !" అంది.

తండ్రి మాట్లాడలేదు.

రెండు పడవలొచ్చి, యేడుపుకు కారణం ప్రమాదం కాదని తెలుసుకొని వెళ్ళిపోయాయి.

తల్లీ తండ్రీ అరుగుపైనే కూర్చొని, కూతురు పెళ్ళి చెడిపోవటం, యిప్పుడు పడ్డ మాటల విలువలు తూస్తూ వుండిపోయారు. వాళ్ళకు ఎటు వెదికినా అవమానం వినా మరోటి కనబడటంలేదు. శకుంతల తమ్ముడు గుండెలపైన పుస్తకం వుంచుకొనే నిద్రపోతున్నాడు.

చీకటి రాలుతోంది వెలుతుర్ని తరిమి. పశ్చిమాకాసం ఎర్రగా ప్రతిబింబిస్తోంది వరద గోదావరిలో. తుమ్మచెట్లవెనక ముసిరిన

చీకటిలో ముడిపడ్డ చల్లని గాలి వరద గోదావరిని దీవిస్తోంది. వాతావరణంలో చల్లదనం, నల్లదనం ప్రియురాలి మనసుతో పెనవేసుకుపోయిన గత స్మృతుల్లా ఉన్నాయి.

శకుంతల రెండు పడవల్ని పిలిచింది. అవి రాలేదు. మూడవ పడవ వచ్చి ఆగింది. శకుంతల పడవలో కూర్చుని, వాడికి డబ్బు ఆశ పెట్టింది. మొదట వప్పుకోనకపోయినా, చివరికి అంగీకరించాడు వాడు. శకుంతల మనసునందుకోవాలని పడవ పరుగెడుతోంది. శకుంతల మనసు నాగరాజువద్ద-

శకుంతల నాగరాజు గుడిశదగ్గిరికి చేరేసరికి అనుకొన్నంత ప్రమాదంమాత్రం జరగలేదు. గుడిశ పూర్తిగా కూలిపోయింది. గుడిశపైని నాగరాజు కూర్చొని ఉన్నాడు.

"దిగిరా రాజూ! వెళ్లిపోదాం పడవలో" అని పిలిచింది శకుంతల.

"నేను రాను" అన్నాడు నాగరాజు. వాడి కంఠంలో విషాదం చోటు చేసి కొంది.

"ఏం?"

"నేను రాను. శకుంతలా! రాను రాను.

"నే నెంత ప్రయాసపడొచ్చానో తెలుసా? నువ్వప్పు డేమన్నానో తెలునా? జ్ఞాపకం లేదా?"

"వస్తే నువ్వురా!?"

"ఇం కెందుకిక్కడ? మరొకవ్వూరుపోదాం! నువ్వప్పుడూ వచ్చే ప్రమాదాలు గుర్తించ లేవు."

"నేను రాను. నువ్వు రా!" అని చెయ్యి అందిచ్చాడు శకుంతలకి.

పడవవాడు డబ్బు తీసుకుని, గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు. ఇలా జరుగుతుందని తెలిస్తే వాడు పడవలో కూర్చోనీయడు. అతనికేమి అపవాదు వస్తుందోనని భయం వాడికి.

నాగరాజు దుఃఖాన్ని ఆపుకోనలేకపోయాడు.

"ఎందుకింకా యేడుపు. కష్టాలుదాటాయి." అంది శకుంతల.

"నీఅంతటి చెడ్డదిలేదు." అన్నాడుదుఃఖం తోకోపాన్ని, కోపంలో జాలినీ కలిపి.

"ఏమిమాటలవి? పెళ్ళినాడు నేనెంత పంతంపట్టినా విన్నారుగాదు మీరు. అదృష్టవశాత్తూ ఆపీనుగ మరింత పాడుచెయ్యాలని తలిస్తే, అదీ మనమేలుకే సంభవించింది."

"నీనోటినుండివచ్చే ప్రతిమాటా అయి తీరుతుంది." అన్నాడు దుఃఖాన్ని ఆపుకోవాలని ప్రయత్నించి విఫలుడై. శకుంతల మాటల్లో కొన్ని మరీ అతన్ని గాయపరుస్తున్నాయి.

"ఏమిటి చెప్పండి? ఏమిటా దుఃఖం?"

"నీకెలాగ తెలుస్తుంది? రాజారావు నా ప్రాణం. వాడెంత మంచివాడనుకొన్నావ్!"

'మీకింకా రాలేదు బుద్ధి.'

'నోర్మూయ్యి. వాడేలేకుంటే నువ్విలాగ రాగలిగేదానివా? నీ బాబు నిన్ను మరొకడికిచ్చి ముడిపెట్టేవాడు మన కథ పూరాంవరికీ తెలీకముందే. అలా జరక్కుండా పెళ్ళి చెడగొట్టాలని రాజారావు పెళ్ళిబేరాలు నడిపి నిన్నూ నన్నూ యిలాగ మిగిల్చాడు. చివరికి వాడి తల్లిదండ్రులూ, లోకం వాడిపై పగబూనితే వొచ్చి నాగుడిశలో దాంకున్నాడు.'

'ఏమయ్యాడు?'

'మనల్ని విడిచి వెళ్ళిపోయాడు. యీగుడిశను విడిచి నేనురాను. రాను శకుంతలా! రాను...' ఇహ చెప్పలేకపోయాడు నాగరాజు.

గుడిశ నాని కూలపోతున్న సమయంలో రాజారావూ, నాగరాజూ వెలుపలికి వస్తున్నారు. నాగరాజు వెలుపలికి వచ్చాడు. రాజారావు రాలేకపోయాడు. దాంట్లోనే మరణించాడని—

'రాజారావూ!' అని కేక వేసి, నాగరాజు పాదాలపైని వాలిపోయింది శకుంతల.

అసమగ్రంగా ఆగిపోతున్న కథ. అంధకారంమధ్య వెలుగూ, — అవును. వెలుగు నీడల తారతమ్యం తెలియని చీకటిలోకంలో వెలుగును చూడలేరు కొందరు. గుడ్డివాళ్ళకు వెలుగు నీడలతోనేకాదు. దివ్యజ్యోతితో కూడా పనిలేదు. కాని, నీ సంకల్పం నెరవేరడమే నీ ఆత్మకు శాంతినీ, సంతృప్తినీయిస్తుంది కదా!

—: o :—

# అధ్యావధి | యస్వీ జోగారావు

ఈనాడు సామాన్యమానవుండ నగు నా
పుట్టు కృతార్థతం బొరసినట్లు
ఈనాడు నా కవితానవనీతమ్ము
కమ్మని నేయిగా కరగినట్లు
ఈనాడు మధురమదీహా విహంగము
లల్లనల్లన రెక్క లార్చినట్లు
ఈనాడు స్వర్గసోపానమ్ము లొక్కటొ
క్కటి నా యెదుట రూపు కట్టినట్లు
మును మదూహాప్రపంచ సంభూత దేహ
ప్రత్యుషః స్వప్న దర్శన ప్రథితరూప
సతత మదుపాస్య దేవతా సాధుమూర్తి
అదిర నా మ్రోల ప్రత్యక్షమయ్యె నేడు.

ఇది రేయికా దిది నిదురకా దిది కాదు
కల; పట్టపగలు జాగ్రదవస్థ
ఇది నాకమునుగాదు, ఇది యాకసముగాదు
నా కాలి క్రిందికాణాచి నేల
ఇది లిట్టు కా దిది ల్పట్టుకాదు; చిరంత
నాన్వేషణమ్ము నద్యావధికము
ఇది కవిత్వమ్ము కా దిది జోస్యమునుగాదు
కనుపాపలో డిది కటిక నిజము
మును మదూహా ప్రపంచ సంభూత దేహ
ప్రత్యుషః స్వప్న దర్శన ప్రథితరూప
సతత మదుపాస్య దేవతా సాధుమూర్తి
కట్టెదుట నేను నాకు సాక్షాత్కరించె.

నేను చూచితి తన్ను, తాను చూచెను నన్ను
చూపు చూపున నెదల్ చూఱవోవ
నేను నవ్వితి నంత తాను నవ్వెను సుంత
నవ్వు నవ్వున సిగ్గు నానిపోవ
నేను ముద్దిడినాడ తాను ముద్దు లొసంగె
ముద్దు ముద్దున కూర్మి మూరిబోవ
నేను చేసాచితి తాను చేసాచెను
కౌగిలింతల మేను కరగిపోవ

మేను మేనున తిరిగిన మెలికలోన
నేను తానను భేదమ్ము లీన మయ్యె
గుండెలో గూడు కట్టిన గువ్వ యొకటి
గునిసి గునిసి తనిసి కువకువలు పోయె.

ఇవి చూపులా గావు వివిధ శృంగార సం
జ్ఞాపాంగ విస్ఫులింగములు గాని
ఇవి నవ్వులా కావు ఏవో జన్మాంతర
ప్రణయానుబంధ మంత్రములుగాని
ఇవి ముద్దులా కావు సవిధసర్వాంగీణ
సుమబాణ చైతన్యసుధలుగాని
ఇవి చేతులా కావు ఎదలు రెండింటి నే
కము చేయు మంత్రదండములుగాని

ఆమె దేవతా కాదు కా దైన నేమి
ఆమెకడ గల నమృతమ్ము నంజనమ్ము
ఒక్క ముద్దుతో ప్రణయసాయుజ్య మిచ్చె
ఒక్క చూపుతో అనిమేష యోగ మొసగె.

-: ౦ :-

రచయిత: శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

# జీవుని వేదన

## (5) విశ్వనాథ సత్యనారాయణ - రచనా ప్రవృత్తి

కావ్యానుభూతి స్వరూపమును వాల్మీకి శోకమనియు, కాళిదాసు పర్యుత్సుకత్వమనియు, భవభూతి కరుణమనియు చెప్పిరి. ఈ చెప్పుటలో పైకి భేదమున్నట్లు గన్పించినను నిజమునకు లేదు. ఆ యనుభూతి యలౌకికము. ఏకరూపము. దాని స్వరూపము జీవవేదనాత్మకమైనదని వారి వాక్యముల ననుసరించి పూర్వవ్యాసమునందు మనము వ్యాఖ్యానించుకొంటిమి. వ్యాఖ్యాగమ్యమైన వారి యుద్దిష్టార్థమును కంఠోక్తిగఁ జెప్పినవాడు విశ్వనాథ సత్యనారాయణ. ఆయన చెప్పిన జీవుని వేదన మహాకవి పరిపాటికి భిన్నమైనదిగాదు. ఆయన వ్రాసిన రామాయణమునందలి పీఠికలో నన్నమాట యిది.

వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితివం
చనిపించుకోవలెన్ వృథా
యాసముగాక కట్టుకథలై హికమా
పరమాయటంచు తా
జేసిన తండ్రియాజ్ఞయును జీవుని
వేదన రెండు నేకమై
నా సకలోహవైభవసనాథము రామ
కథన్ వచించెదన్॥

ఆయన తండ్రి రామాయణము వ్రాయుమన్నాడు. ఎందుకని? రామాయణము ఇహపర సాధకము గాబట్టి. ఆ తండ్రియాజ్ఞతో తన జీవుని వేదన యేకమైనది. అనగా తండ్రి యేకథ వ్రాయుమని చెప్పెనో యాకథయందు తనకు నాత్మసంవాద మున్నదని యర్థము చేయవచ్చును. మఱియు తన జీవుడార్తి మగ్నుడై యున్నాడు. రామకథను వ్రాయుట వలన నా పరమార్తి నుత్తరించి మోక్షమును సంపాదించుకొనవచ్చునని, యర్థము చేయవచ్చును. ఈ యర్థములు న్యాయమునకు భిన్నములు గావు. ఎందుచేతననగా హృదయమునందు నార్తికలవానికే రామాయణకథతో నాత్మసంవాదము కుదురును. రామకథతో నాత్మసంవాదమననేమి? ఆ కథ నాశ్రయించి యీ యార్తి నుద్దీపింపజేసికొనుట. అచ్ఛమైన యార్తి యే జీవుని వేదన. దానిని నిరంతరము ప్రజ్వలింప జేసికొనుట యే కర్తవ్యము. ఈ యార్తి యొక యగ్ని. దీనియందే కథలైనను హోమము చేయబడవచ్చును. ఈ కథలింధనములు. కాని రామకథ హోమము చేయుట వేరు. అగ్నిలో నేపదార్థము హోమము చేయబడునో దాని రంగు ఆ యగ్నికి సంక్రమించును. మోదుగ, ఆవు నేయి, మొదలైన హవ్యములవలన నగ్నికి వచ్చు దీప్తి వేరు. రామకథ యట్టిది. హృద్గతమైన యార్తియందు రామకథను హోమము చేయగా వచ్చు దీప్తి యచ్ఛమైనది. దివ్యమైనది. రామకథ నాశ్రయించి జీవుని వేదనను పవిత్రీకరించుకొనుటయే రామకథయం దాత్మసంవాదము చెందుట.

ఇప్పుడు జీవుని వేదనకు రెండు స్థితులున్నవి. మొదటిది రసాకూతి. రెండవది రసానుభూతి, రసమనగా జీవుని వేదనయని పూర్వ వ్యాసములందు వ్యాఖ్యానించుకొంటిమి. పై పద్యమునందు చెప్పిన జీవుని వేదన స్థితి రసాకూతి. ఈ రసాకూతి యే రామకథ నాశ్రయించి రసానుభూతిగ పరిణమించును.

ఆ కూతినుండి యనుభూతివరకు నేకరసముగ వ్యాపించియుండునది జీవుని వేదన యొకటే. ఈ రసాకూతి జీవునియందెంత గాఢముగ నుండునో రసానుభూతియు నంత యుల్బణముగ నుండును. అందుచేత జీవుని వేదనయొక్క యీ యాకూతి దశ చాల ప్రధానమైనది. దీని స్వరూపమేమి ?

ఒక పెద్ద ప్రశ్న యున్నది. ప్రపంచకములో నిన్నికోట్లమంది మనుష్యులున్నారు. వీరిలో చాల భాగము సామాన్యులు. అనగా నిత్యజీవితమును సాగించుకొనుటయందే ప్రధానముగా లగ్నచిత్తులైన వారు. ధనమో, గృహములో, భూములో సంపాదించుకొని యైహిక జీవనమును సాధ్యమైనంత సుఖమయముగా జేసికొనుటయే వీరి కోరిక. వీరిని వదలి మఱియొక పద్ధతి మనుష్యులున్నారు. వీరికేదియో తమ జీవితమును దాము సుఖమయమును జేసికొనుటలో తృప్తిలేదు. గృహారామాది సంపత్తు సంపాదించుకొనుటలో వీరు చరితార్థులైనట్లు భావింపరు. వీరిలో ప్రతివ్యక్తికిని నేదియో మహాకార్యమును చేయవలయునని కోరిక. ఆ కోరికను సాధించుకొనుటలో తమ దైహిక సుఖములను వీరు లెక్కచేయరు. దైహికములైన యెన్ని కష్టములకు నోర్చి తమ కోరికను నెరవేర్చికొనుటకే వీరు సర్వథా ప్రయత్నింతురు. వీరిలో నొకడు రాజ్యములు పాలించును. ఒకడు మహావీరుడగును. ఒకడు వేదాంతియగును. ఒకడు మహాతపస్వియగును. ఒకడు మహాకవియగును. మహాశిల్పియగును. మహాగాయకుడగును. మహాశాస్త్రవేత్తయగును. ఇంత మహాసృష్టి యింత యనంతముగా సాగుచున్నను ఆ మొదటి పద్ధతి మనుష్యులకు పరిగణనము లేదు. ఇన్నికోట్లమంది జనులు పుట్టుచుండగా చచ్చుచుండగా నొక శ్రీరామచంద్రుడు, ఒక ధర్మరాజు, ఒక శంకరాచార్యుడు, ఒక వాల్మీకి, ఒక కాళిదాసు ఒక త్యాగయ్య ఆయొక్క డే యెప్పుడో యెక్కడో పుట్టి పరిగణనకు నెక్కును. దీనికి కారణమేమి ? ఈ సామాన్యులకు దేహామే ప్రధానము. దేహపోషణే ప్రధానము కాబట్టి వారికి పరిగణన లేదు. వారియందున్న కోరిక మొద్దుగా నున్నది. దానియందు వాడిలేదు, పదను లేదు. అనగా వారిలో జీవుని వేదనలేదు. ఆ జీవుడు నిద్రపోవుచున్నాడు. వాడు వట్టి మొద్దు. ఎంత తట్టిలేపినను మేల్కొనునట్టి స్వభావము గలవాడుగాడు. ఈ రెండవ పద్ధతి జనులలోని జీవుడట్టివాడుగాడు. వారిలోని జీవుడు జాగరూకుడై యుండును. నిరంతరవ్యగ్రుడై యుండును. ఏవియో దూరమునందున్న పిలుపులకోసము చెవియొగ్గి యాలకించుచుండును. అనగా వీరిలో జీవునివేదనయున్నదన్నమాట. కాని వారి జీవసంపుటిలోనున్న నైచిత్రినిబట్టి వారిజీవుని వేదనలోని యాకూతి స్వరూపము భిన్నముగా నుండును. దానిని బట్టి వారి సాధనయు వాని నిర్వహించు కార్యమును భిన్నభిన్నముగా నుండును. ఇందుచేత జీవుని వేదనయందలి యాకూతి మిగుల ప్రధానమైనదని చెప్పితిని. ఈయాకూతి వానిని కూర్చుండనీయదు. నిలుచుండనీయదు. అది తన్ను దాను నిరంతర ప్రజ్వలితమును జేసికొనుటకై త్వరపడుచుండును. జీవునితొందర పెట్టుచుండును. ఈతొందర ననుభవించిన వాడు విశ్వనాథ సత్యనారాయణగారు. ఆ తొందరయే పూర్వము చెప్పిన పద్యములోని జీవుని వేదన. రసాకూతిస్థితి స్వరూపముగా గలది.

ఏతాదృశమైన రసాకూతి యీయన చాల చిన్ననాటనుండి యనుభవించుచుండిన వాడు. ఈయన సర్వసారస్వతము జీవుని వేద నాజన్యమైనదని యీయన వ్రాసిన గ్రంథము లన్నియు సాక్ష్యము నిచ్చును. గిరికుమారుని ప్రేమగీతములలో నీ రసాకూతిని గురించి మొదటి ఖండికయందే యీయన చెప్పుటను బట్టి యీయన దీని ప్రాధాన్యము నెంత గమ నించియున్నాడో మనకు తెలియుచున్నది.

అస్మదీయ కంఠమునయందాడుచుండె
నొకయెదోగతి బైటికి నుబికిరాదు
చొచ్చుకొని లోనికింబోదు వ్రచ్చిపోయె
నాహృదయ మీమహాప్రయత్నమ్మునందు.

విఫలిత పునఃపునః కృతవివిధయత్న
భావితప్రచండ బాధాతిథా విదారి
తాస్మదీయహృదంతరంబందు దోచె
స్ఫురిత నవజపాశోణ సంధ్య.

ఈమహాసంధ్యలో శారదామయూరి
రమ్యకింకిణి కిణి కిణి రభసపాద
మంజుల విలాసనృత్య సామ్రాజ్యలక్ష్మి
యగుచు కచ్ఛపీమృదుగీతులను సరించు.

అచ్ఛమైన జీవుని వేదన నిరాలంబముగ నుద్దీప్తమైనస్థితి యీపద్యములయందు వర్ణిత మైనది. దానికాలంబములేక బహిర్గతమగు టకు వీలులేదు. ఒకయెదోగతి కంఠమునం దాడుచున్నది. అది బయటకురాదు. లోనికిని బోదు. గాఢమైన రసాకూతి యట్టులుండును. ఆజీవుని వేదనను బయటకు వ్యక్తముచేయు టకుం జేసిన యత్నములు విఫలములైనవి. దాని స్వరూపమును రూపు కట్టించుకొనుటకు వి మిక్కిలి బాధపడెను. అది వ్యక్తావ్యక్తము లకు మధ్యనున్నస్థితి. అచ్చటనుండి శారదా నృత్యము కచ్ఛపీ మృదుగతుల ననుసరించుచు బయలుదేరినదట. ఈపద్యముల భావ మీా క్రిందివిధముగా గ్రహించవచ్చును. కవియైన వానికి నాలంబములేని తెల్లముగాని రసా కూతి హృదయములో నిరంతరము దీపించు చుండును. అదియొక దిగులువంటిది. అది యెప్పుడు గుండెను పీకుచుండును. ఇదియచ్ఛ మైన కవితాత్మ స్వరూపము. ఈయాకూతి, యీగుండె పీకుడల ప్రధానముగా కళాశీలి యైనవానికుండవలసిన గుణములు. కడమ సంస్కారము లప్రధానములు. ఆతక్కిన సంస్కారములన్నిటికి నిది ప్రాణభూతమైనది. కాని యాసంస్కారములకు దీనియావిష్కరణ స్వరూపమును నిర్ణయించుటలో మిగుల నధి కారమున్నది. అందుచేతనే యొకడు కవి యగుట, యొకడు గాయకుడగుట, మఱి యొకడు శిల్పియగుట. ఆయా విష్కారము యొక్క యాకృతి యేదియైనను దాని యాం తర స్వరూపము జీవుని వేదనయే. ఈమూడు పద్యములలో మొదటి పద్యమునందు రసా కూతిదశలోని జీవుని వేదన చెప్పంబడినది. రెండవ పద్యమునందు దాని యుద్దీపనము చెప్పబడినది. మూడవ పద్యమునందు నుద్దీ ప్తమైన యనగా ననుభూతిదశనందిన జీవుని వేదన చెప్పంబడినది. దానియొక్క నిష్యం దనే కచ్ఛపీగతి సరస్వతీ నృత్యము.

మఱి యీరసాకూతియొక్క స్వరూప మేమి? ఇది జీవున కెచ్చటనుండి సంక్రమించి నది? యను నంశములను విచారింపవలసి యున్నది. ఈయాకూతి యొక దిగులువంటి దని చెప్పితిని. ఈదిగులు కారణము లేనిది. లేక కారణ మెఱుంగరానిది. ఇదికలవాడు తానేదియో మహార్ఘమగు వస్తువును పార వైచికొన్నట్లు బాధపొందుచుండును. ఆమహా

నర్ఘమైన వస్తువేదియో యతనికి తెలియదు. దీని స్వరూపము మిగుల చిత్రముగానుండును. చీకటిరాత్రి వర్షములో దారితప్పి యొంటిగా బోవుచుండగా వెనుకనుండి యెవరో తన్ను బిల్చినట్లు, నిద్రపోవుచుండగా నెవరోనూతిలో బడిపోయి లోతులలోనుండి తన్ను బైకితీయు మని కేకలు వేసినట్లు వినిపించినట్లుండును. జీవుడు పారవైచికొనిన యామహార్ఘమగు మణియేది? అతడు దానినెందులకు పారవైచి కొనెను? ఆమహానర్ఘమగుమణి పరమేశ్వరుడు. అజ్ఞానమువలన జీవుడా పరమేశ్వరునకు దూరమైపోయినాడు. ఆపరమేశ్వర విరహమును నిత్య మనుభవించుచున్నాడు. నిరవధిక సుఖస్వరూపమైన యాపరమేశ్వరుని బొందవలెనని తనకు తెలియకయే నిత్యమారాట పడుచున్నాడు. ఈయారాటమే యాపరమేశ్వర విరహానుభవమే జీవుని వేదన. సృష్టియందు కన్పించు ప్రతివస్తువు నాపరమేశ్వర భావమును కొంచెమో గొప్పయో సంగ్రహించుకొన్నది. దీప్తిమంతమైన యేపదార్థమైనను పరమేశ్వర భావము నుద్దీప్తముచేయుచుండును. ఊర్జితమైన పదార్థములయందీ పరమేశ్వర విభూతి నిండియున్నది గావున నాయా పదార్థముల సన్నిధానమునందీ జీవుని వేదన పొంగిపోవు చుండును.

ఈ యనిలాధ్వమెల్ల నినదించెడి మువ్వల
మ్రోత దూరమై
పోయిన గోతతిన్ బిలుచు వోలిక నేదో
విని స్వనించెదన్
రాయిడి చెందుచున్ దెలియరాక వగర్చి
పురానుభూతముల్
తీయని భావముల్ తలపు తెచ్చుకొనన్
వలవంత గుందెదన్।

ఈ పద్యము శృంగార వీథిలో సాక్షాత్కారమన్న ఖండికకు మొదటిది. ఆకసమంతయు నిండి మువ్వలమ్రోత వినిపించుచున్నది. ఆ మ్రోత విని జీవుని వేదన పొంగినది. ఆ మ్రోత జీవుని యంతఃకరణము నంతః ప్రవణము గావించినది. అచ్చట నేవియో తీయని భావముల స్పష్టములై భాసించి హృదయమును రాయిడిపెట్టినవి. అనగా జీవుని వేదనను పొంగార్చినవి. ఇదియే వలవంత. అనగా విరహ వేదనము. ఎవరితోడి విరహము? ఆ యెవరో చెప్పబడలేదు. అందుచేత నది నిరపేక్షకమైనది. ఈ నిరపేక్షకమైన విరహమునందు విషయము పరమేశ్వరుడని యర్థాదాపతితము. నిరపేక్షకమైన యే యనుభవమైనను సాక్షిచైతన్య స్వరూపమే యగును. జీవుని యంతఃకరణ మంతః ప్రవణమైనప్పుడు చిత్తమునందు నిక్షిప్తములైన సంస్కారములు భాసించునుగదా! ఈ సంస్కారములకు భాసన యింద్రియాదులవల్ల కలుగునది గాదు. అందుచేత నివి సాక్షిభాస్యము లని యంగీకరింపక తప్పదు. సాక్షియనగా నావృత చైతన్యముగాదు. ఉపహిత చైతన్యము సాక్షి. అనగా నాస్థితియందు జీవచైతన్యమునకు నావరకముగా నున్న యజ్ఞానము తొలగిపోవును. ఆత్మప్రకాశము చిత్తమునందు నిండి యనాది సంస్కారములు భాసించును. సాక్షిభాస్యత యనగా నిది, అంతఃకరణ మంతః ప్రవణమైనప్పుడు చిత్తగత సంస్కారములు జీవచైతన్యముచే తళతళలాడుచు దర్శనమిచ్చు నన్నమాట. ఈ దర్శనమే పైన జెప్పిన నిరపేక్షకమైన విరహానుభవము. ఈ దర్శనము సంస్కారముఖమున గలిగినది గదా యీ సంస్కారములు ముఖ్యమా? ఆ జీవచైతన్యము ముఖ్యమా?

యన్న ప్రశ్నమున్నది. పై పద్యములో చెప్పిన తీయనిభావము లీసంస్కారములు. వలవంత యీ జీవచైతన్యము. ఏతాదృశమైన యనుభూతియందు చైతన్యసాన్నిహిత్యమున సంస్కారములు ప్రకాశించినను అనుభూతి స్వరూపము చైతన్యమే కావున చిత్తము నందు చైతన్యప్రసరణ సమకాలముననే దహంకారము విగళితమై పోవుచున్నది గావునను నిచ్చట సంస్కారము లుపహతములే యగుచున్నవిగాని విశేషణములగుటకు వీలు లేదు. అందుచేత చైతన్యమునకు ప్రాముఖ్యమంగీకరింపవలెను. ఈ చైతన్యము పరమేశ్వర స్వరూపమే. అందుచేత నిరపేక్షమైన యనుభవమనగా జీవచైతన్య ప్రకాశమనియు చైతన్యము పరమేశ్వర స్వరూపమనియు మనకు తెలియుచున్నది. కావున నిరపేక్షకమైన విరహానుభవములో విషయము పరమేశ్వరుడు. ఇట్లు పరమేశ్వర విరహానుభవము పరమేశ్వరానుభవమే యగుచున్నది. ఇట్టి యనుభవమును గలిగించినది గావుననే యీ మువ్వల మ్రోత దూరమైపోయిన గోతతిని పిలుచుచున్నదట. ఈ మువ్వల మ్రోత యెవరు చేసినది? తనవాని పద్యములను జమువుటవలన బాలకృష్ణుడు ఈ మువ్వల మ్రోత నాకసముం దంతటను సందడింపజేసెనని మనకు తోచును. ఈ బాలకృష్ణుడు బాలకృష్ణుడు గాడు. ఈ మువ్వల మ్రోత మువ్వల మ్రోతగాదు. వివర్తమైన సృష్టి తానగుచున నిత్యసిద్ధమైయున్న పరబ్రహ్మ పదార్థమీ బాలకృష్ణుడు. అనాటనుండి యీ నాదావిష్కారము జరిగినది. ఈ శబ్దబ్రహ్మావిష్కారము జరిగినది. ఆ శబ్దబ్రహ్మమే మహా భూతాకాశముగా వివర్తమైనది. ఆ యాకాశమంతయు నిండి విన్పించుచున్న మువ్వల మ్రోత యాశబ్ద బ్రహ్మము. అది దూరమైపోయిన గోతతిని పిలుచుచున్నది. ఈ గోవులు బృందావనములో మేతకైపోయి దారితప్పినవి గావు. ఇచట గోవులనగా వాక్కులని యర్థము. తన వాక్కులు పరమేశ్వర తత్త్వమునకు దూరమై పోయినవి. లోకమన్న యడవిలో దారితప్పి పోయినవి. ఆకాశమంతయు నిండి నిబిడీకృతమైయున్న యీ శబ్దబ్రహ్మము పరమేశ్వర తత్త్వము వంకకు తన వాక్కుల నాకర్షించుచున్నది. ఆ పరమేశ్వర తత్త్వము పట్టుకొనవలెనని జీవుని వేదన పొంగారినది. ఆ పరమేశ్వర తత్త్వ ప్రతిపాదకమైన రామకథ వ్రాయుచున్న పెండ్రిడి యాజ్ఞతో జీవుని వేదన యేకమైనది. జీవుని వేదన నుండియే సకలోహావైభవము పుట్టినది. ఊహ కావ్యమునందు గుణాలంకార రూపమున నుండును. గుణాలంకారములు భావననుండి పుట్టును. భావన వేదనా ప్రసవము. అనగా వేదనయొక్క జ్వలనము. అనగా రసాకూతి యందలి జీవుని వేదన రసానుభూతి దశ నారోహించుటకు చేయు వ్యాపారము. ఇట్టి భావనామయమైన యూహావైభవముతో సనాథమైన రామకథను తాను రచించెదనన్నాడు. మనము రామకథ చదివితిమి దానివలన నాయన యూహావైభవము, దానివలన భావన, దాని నుండి వేదన మనకు నవగతమగు నన్న మాట అనగా రామకథ వట్టి రామకథగాదు. ఆ రామకథ యందలి అంతర్భూతమైన జీవచైతన్య జ్యోతి జీవుని వేదనా ప్రదీపము వెలుగుచున్నది. దానికి చుట్టు సహస్రకోణములలో నూహామయమైన శిల్పమయమైన రామకథామణి చిత్రము లమర్పబడినది. ఈ సహస్రముఖములనుండి దర్శింపవలసినది. యాంతరమైన యా జ్యోతి. దానియొక్క ముఖము పద్య

రచనము. ఒక ముఖము అలంకార సంయోజనము. ఒక ముఖము కథాకథనము. ఒక ముఖము పాత్రచిత్రణము. ఒక ముఖము పాండిత్య ప్రకర్ష. తెలుగు సంస్కృతముల పలుకుబళ్ళు, లోకజ్ఞత, వివేకము ఒక టేమిటి నీయిష్టము వచ్చినన్ని లక్ష చెప్పికొనుము. అవి యన్నియు నీయాంతర జ్యోతిని ప్రతిబింబీకరించుకొన్నప్పుడే యీజీవచైతన్య సందీపితములైనప్పుడే వానికి చారితార్థ్య మున్నది. వీని యన్నింటికంటె నా జీవచైతన్యము ప్రధానమైనది. దాని దృష్ట్యానివి యుపసర్జనీకృతములు గౌణములు. అప్రధానములు. వీని యన్నింటియందును నా జ్యోతిని దర్శించుట యచ్ఛమైన కవితాత్మను పట్టుకొనుట. ఏ యొకటినో చెప్పి యిది లోకోత్తరముగా నున్నదనుట దీప ప్రకాశములైన పెట్టిన గాజుబుడ్డిదని చెప్పుటవంటిది. ఈ పైని చెప్పిన సహస్రముఖములు సహృదయుని హృదయమున నా దీప్తి కలిగించుటకు సాధనములు. సాధ్యమాదీప్తి. అని సత్యనారాయణ గారి రామాయణాం తర్గతమగు మరియొక పద్యమే చెప్పుచున్నది.

తానై చూచిన నెద్దికల్గును హృదంతః ప్రీతి యా ప్రీతియ
క్లైనీకుం గలిగింపజేయుటకునై యత్నంబు గావించు వా
క్జ్ఞానంబా వచియింపగా బడినదాధారంబుగా నీవు చి
త్తానం జూచిన మాయలేడిదగు సౌందర్యంబును స్పష్టమా॥

నీవు సహస్రముఖముల చెప్పుము. లక్ష ముఖముల చెప్పుము. కోటి ముఖముల చెప్పుము. ఇదియంతయు నీవు పొందిన జీవచైతన్యానుభవమును వానిహృదయమున గల్గించుటకు చేయు ప్రయత్నము. ఇది యట్టియాధారము. దీనిని తీసికొని వాడు చిత్తములోనికి జూచుకొనవలయును. అనగా వాడు తనలో దాను మునిగిపోవలయును. వాని చిత్తమంతః ప్రవణముగావలయును. వాని జీవచైతన్యము పొంగి పొరలవలయును. అట్టి యోగ్యత వానిజీవసంపుటియందున్నప్పుడుమాత్రమే నీప్రయత్నమంతియు ఫలియించును. దీనినే భవభూతి సమానధర్మ మన్నాడు. ఈసమానధర్మము నాశ్రయించుకొని కవితా సంప్రదాయము పుట్టినది. బహుశిల్పమార్గములు పుట్టినవి. ఈశిల్పమార్గముల యందు జీవుని వేదన యెట్లు ప్రతిబింబించుచున్నదో క్రమముగా వివరించుటకు ప్రయత్నింతును.

—:o:—

# ఆంధ్రభాష - అవ్యవస్థ | "గాండీవి"

భాషావిషయకమైన యవ్యవస్థ సర్వతోముఖముగా వ్యాపించియున్నది. ఈ యవ్యవస్థ యను మహావృక్షమునకు మూలములు ముద్రణములు. స్కంధము వ్యావహారిక వాదము. శాఖలు వింత వాదములు. తాళపత్ర మాతృకలు బహుదోషములకు నిలయములు. వానిలో లేఖక పాఠకులెన్నో మార్పులు చేర్పులు చేసినారు. వానిని సంస్కరించి ముద్రించుచున్నారు. ఆ సంస్కర్త లెంతటి వారైనను భ్రమప్రమాదములు తప్పవు. వారికి స్వసిద్ధాంతస్థాపనాపరత్వ ముండెనా యింకఁ జెప్పవలసినది లేదు. ఏ యాంధ్రగ్రంథమును నిప్పటికి సుపరిష్కృతము కాదు. ఛందోభంగాది దోషములెన్నియో ముద్రణముల కెక్కినవి. ఈ తప్పుల తడకలగు ముద్రణముల ననుసరించి వాదములు బయలు వెడలుచుండును. ఎఱ్ఱన గ్రంథచోరుఁడు. ప్రాచీన మహాకవు లజ్ఞులు. ఈ విధముగా నా వాదములుండును.

ఎఱ్ఱన యారణ్యపర్వశేషమునుఁ బూరించినాఁడు. అందులో నన్నయ నీపాదులలోఁ బాటించిన నియమములు తానునుఁ బాటించినాఁడు. ముద్రణ సంస్కారలోపమువల్లఁ గొన్నిచోట్ల నా నియమములు తప్పిపోయినవి. ఆ తప్పిపోవుటవలన వచ్చిన వాదమిది. నన్నయ యారణ్యపర్వమెల్ల వ్రాసినాఁడు. దానిలోఁ గొన్ని శిథిలభాగము లారణ్యపర్వశేషమున నేర్పడెను. ఆ శిథిలములైన స్థలముల నెఱ్ఱన పూరించెను. అరణ్యపర్వశేషపూరణమనఁగా శిథిలములైన పద్యపాదాదుల పూరణమే. ఈ వాద పర్యవసాన మెఱ్ఱన గ్రంథచోరుఁడని. నన్నయ భారతమునందెల్ల నీ నియమములు భ్రష్టమైన వని వాదించువారు, చూచుకొనలేదు. మచ్చునకుఁ గొన్ని చూపుచున్నాను.

(1) సకలధర్మ విదుండవు సర్వలోకవర్తనము లెఱింగిన పుణ్యకీర్తివీవు.

(ఆది 3-224.)

ఈ పద్యము ప్రాసయతి గీతముగా రచింపఁబడినది. కావున నీ నియమము ప్రథమ పాదమునఁ దప్పినది. 'సర్వలోక' అనుచో 'సకలలోక' నన్నయ పాఠము కానోపును. ఇట 'సకల' శబ్దము పునరుక్తమైనదని సంకోచింపరాదు. 'సర్వతీర్థాభిగమనంబు సర్వవేద, సమధిగమము' (ఆది 4-9 .) అనుచో సర్వశబ్దము ముద్రణములలోఁ బునరుక్తముగా నంగీకృతమై యున్నది.

( ) 'కౌఁగిలించు, కొనితెదీయ మూర్ధాఘ్రాణ మొనరఁజేసి (ఆది 6-53.)

ఇక్కడ యతియే యావశ్యకము. కావున 'కౌఁగిలించియును' కవిపాఠము కావచ్చును.

(3) 'సు, రారి నిశ్చల ఘన భీకరాంగుఁ బట్టి (అరణ్య 1-102.)

ఇచ్చటఁ బ్రాసయతియే యుండవలెను. కావున నీ వావిళ్ళ ముద్రణము సరికాదు. 'సు, రారి నిశ్చల భీకరా కాయుఁబట్టి' అను 'రామా - అండ్ - కో' ముద్రణమే యుచితము. 3-215 చోటఁ గూడ వావిళ్ళ ముద్రణము సరికాదు.

(4) యాదవవృష్ణి భోజాంధులెల్ల. (అరణ్య 1-122.)

ఇట 'భోజాదులెల్ల' నన్నయ ప్రయుక్త మనఁదగును.

(5) అవ, ర్థనము నిట్టు చేయఁదగునెవిధికి (అరణ్య 3-162.)

ఇక్కడఁ బ్రాసయతియే కావలయును. కాన, 'అవ, ర్థనము నిట్లు చేయఁ జనునె విధికి' సరియైనదిగా నెన్న నగును.

(6) 'అనిన నీ చెప్పిన యగ్గుణములు' (అరణ్య 4-128.) ప్రాస యతి సరిపెట్టుటకై 'అనిన నీవిపుడు చెప్పిన గుణములు' అను రీతిని గ్రహింపవలసియుండును. ఇట్టి నియమ భంగము లింకనుఁ గలవు. (ఆది 1-81,119; అరణ్య 1-49, 2-263; ఆది 8-123, సభా 1-2.) పాఠాంతరములు స్వీకరించి కొన్ని స్థలములందలి నియమ భంగములను వారించుకొననగును. (ఆది 2-84,131,187;4-259; 7-112.)

ఈ యుదాహరణములవల్ల నొక విషయము తెల్లమగుచున్నది. ఈ నియమభంగములు నన్న భారతమునందెల్ల గలవని. ఇప్పుడు నన్నయ భారతమెల్ల శిథిలమై పోయినదందురా? ముద్రణ సంస్కార కృతమందురా? ఆహా! యెట్టి శిథిల భాగములను బూరించినారట. ఆ పూరణమైన నెంత సమర్థతతో జేసినారు? నన్నయ నియమములు భ్రష్టములుగా జేసినారు. అందుకు మెచ్చుకొని యతనికిఁ బ్రబంధపరమేశ్వర బిరుదము నిచ్చినారు!! ముద్రణ లోపమువలన వచ్చు వాదము లెట్లుండునో చూడుఁడు.

(1) మఱికొన్ని యతిభ్రంశములను బరిశీలింపుఁడు. 'తొడరెడు నదివోలె ధృతఫేన వితతుల'. (అరణ్య 3-39.) ఇట 'ధ్రువ ఫేన వితతుల' ప్రధాన పాఠముగా ముద్రితము. 'ధృత' పాఠాంతరముగాఁ జూపఁబడెను. 'ధ్రువ' అన్నచో నర్థపుష్టిలేదు. నన్నయకు 'ధృత' శబ్దములో వట్రువ కలదని తెలియదు. క్రాముడి యున్నదనుకొని 'తొడరెడు నదివోలె ధ్రుతఫేన వితతుల' అని వ్రాసి యతి సరిపెట్టుకొనెను – అను, వాదము బయలు వెడలెను. నన్నయ శబ్దస్వరూపానభిజ్ఞుఁడా? ఇచ్చట 'తొడరెడు నదివోలె ధృతఫేన వితతుల' కవి ప్రయుక్తము కానోపును. మూలములో 'హసంతీమివ ఫేనౌఘైః' అనియే యుండుఁగాక. నన్నయ మక్కికి మక్కిగా నాంధ్రీకరించువాఁడు కాఁడు. 'తెరలెడు నదివోలె ధృతఫేనవితతుల' అనియు నన్నయపాఠము కావచ్చును. 'తెరలు' శబ్దమునకు 'జంకు' అను నర్థము కలదు. ఇట 'తొట్రుపడు' అను రీతి నర్థము నెన్న నగును.

(2) 'కల్గి దే, వునకు ననుంగువాఁడవని యుత్సుకతన నుతియింతు' అను వృషాధిప శతక ప్రయోగమును గూర్చి వాదము లిట్లు చేయఁబడును. సోమనాథుఁడు "వు-ఉ" యతి వేసినాఁడు. "ఉత్సుకతన" అజాది పదమని తెలియక "వుత్సుకతన" గా భ్రమించి యతి స్థానమున వేసికొన్నాఁడు. సోమనాథునికూడ నిట్లు భ్రమలకు లోనయినాడు. ఈ వాద సారాంశము స్పష్టమే. సంస్కృతములో "వుత్సుక" వర్ణాదిగు శబ్దమును బ్రయోగించి యుంపవచ్చును. ప్రచుర-ప్రయోగమున్నఁ గదా భ్రమ కలుగుటకు వీలుండును? ప్రచుర ప్రయోగము లున్నప్పుడును సామాన్యులే భ్రమప్రమాదములకు లోనగుచుందురు. సోమనాథాదులు భ్రాంతులైరనుట విశ్వాసనీయము కానేరదు. "కల్గి దే, వునకు ననుంగు

వాఁడవని ప్రోత్సుకతన్ నుతియింతు' కవి పాఠము కానోపును. ఇట్లే స్థలాంతరములందును గ్రహింపవలసియున్నది.

(3) "హృషీకేశనామశోభినైతివి కృష్ణా" (హరి. ఉ. 6-87.)

ఈ కందపద్య పాదమున యతిభ్రంశమే కాదు గణభంగముకూడ ముద్రింపఁబడెను. దీనినిగూర్చి వాదము లిట్లుండును. ఎఱ్ఱన ఋకారమును జూచుకొనక హకారపుఁ దలకట్టునుజూచి యతి వేసినాఁడు. 'హృషీకేశ' శబ్దమును బ్రయోగింపవలెనను భావముతో గణభంగమున కంగీకరించినాఁడు. ఇది యీ వాదధోరణి. అనఁగా నెఱ్ఱనకు 'హృ' లో ఋకారము కలదని తెలియదు. ఏదో శబ్దములను బద్యములలోఁ బెట్టఁబోయి యట్లుచేయఁ జాలక గణభంగమునకే తలయొగ్గుచుండును. ఇది ఫలితార్థము. ముద్రణమూలను యథాస్థితముగాఁ బ్రమాణీకరించినచో నెట్టి వింత వాదములైనఁ జేయవచ్చును. ముద్రించువారున్నఁజాలును. 'ఆకాశవాణి యిట్టులనియె ఫణినాథ' (ఆం. వ్యా 3-54.) అన్నచో వావిళ్ళ ముద్రణమున యతి తప్పినది. నన్నయకు యతులు తిన్నగాఁ దెలియవందురా? 'సంభృత నుతవిధ్వజంబొప్పఁ గోధాంగు. ళిత్రాణుఁడై యతుఁ బ్రశాంతి' (ఆం. వ్యా 1-164. వావిళ్ళ.) అనుచో గణభంగము వచ్చినది. నన్నయ గణభంగములు తెలియక చేయుచుండునను. రోనా? రామా - ఆంధ్ - కో- ముద్రణమున నీలోపములు లేవు. "వాణి యిట్టులనియె వసుమతీశ", "సంభృత మకరధ్వజంబొప్పు బద్ధగో, ధాంగుళిత్రాణుఁడై యతుఁ బ్రశాంతి" అని సరిగానున్నవి.

ప్రకృత హరివంశ పద్యమునుగూర్చి (శ్రీ) నడకుదుటి వీరరాజుగారు "విమస్మ తరంగిణి" యందిట్లు వ్రాసియున్నారు. దీని నాల్గవపాదమున గణభంగమును యతియునుఁ దప్పినవి. పై సంస్థానపు వ్రాతప్రతి (పీఠికాపుర సంస్థాన తాళపత్రప్రతి.) యందిట్లున్నది. "సుషమ హృషీకేశనామశోభివి కృష్ణా" సుపరిష్కృతములుకాని ముద్రణములను మూలముగాఁ గొనిచేయు వాదములెట్లుండునో విజ్ఞులరయుఁడు.

ఇంతేకాదు. ప్రాచీన మహాకవులకు 'థ-ధ' లకు 'శ-స' లకు 'ఫ-భ' లకు భేదము తెలియక యథాప్రయోగములుఁ జేయుచుందురఁట. ఈవాద మెట్లుండునో మచ్చునకొక యుదాహరణము చూపెదను.

'ఫాలము' అనుటకు వ్యవహారములో 'భాలము' అని యందురఁట. దానిని విని "భాలము" సరియైన శబ్దమనుకొని మహాకవి రామరాజ భూషణుఁడు "భాలసన్నుతహేతి" (హ. న.) అని శ్లేషస్థలఘటితముగాఁ బ్రయోగించినాఁడఁట!

అసలు "ఫాల" శబ్దమునకు లలాటమను నర్థము సంస్కృతకోశములలో లేదు. ముఖ్యమను నర్థము దీనికి నానార్థ రత్నమాలలోఁ గలదు. (                    ) దానినుండియే లలాటార్థము వచ్చియుండిన వచ్చియుండవచ్చును. లలాటార్థముగల నిర్వివాదశబ్దమే "భాలము". "భాల. న. భా-లచ్. లలాటే ---" (వాచస్పత్యము) "భాలమ్. క్లీ. భాలదీప్త + భా + క్విప్. భాం లాతి గృహ్ణాతీతి. లా + ఆతో౽నుపసర్గేకః 3-2-3 ఇతి కః ప్రభాన్వో సూర్యభాగః..." (శబ్దకల్పద్రుమము.) త్రికాండశేషాదులలోఁ గూడ నీ శబ్దముకలదు. ఈ భాలశబ్దసాధుత్వము నెఱుఁగక పరిష్కర్తలుచేయు తబ్బిబ్బులను స్థలాంతరములందుఁ బ్రకటించి

యున్నాను. విస్తరభీతిచే వాని నిటఁజూపక విడుచుచున్నాను.

వ్యావహారిక భాషకు లక్షణము వ్రాయుటకై పూర్వకవులను శబ్దస్వరూపానభిజ్ఞులను జేయనక్కఱలేదు. లాక్షణికులుచేయు కొన్ని నిషేధములనుబట్టి యాకాలములందలి లేఖక పాఠకులు వ్రాయు తప్పులు మనకు స్పష్టపడఁగలవు. అంతేకాని యానిషేధములు మహాకవులు వ్యవహారవశమున శబ్దస్వరూపము తెలిసికోలేనివారై రనుటకు సాధకముకాదు. ఎంత పెనంగి నలంగినను శిష్టవ్యావహారికము ప్రాచీనకవి సమ్మతమని సాధించుటకు శక్యముకాదు. కావున వారి నజ్ఞులని నిర్ణయించి నను వచ్చు ప్రయోజనము లేశమును లేదు.

నేఁడు శిష్ట వ్యావహారికమునకు వ్యాకరణము వ్రాయుదుమందురా? సంతోషమే. కాని యది, యే యల్పసంఖ్యాకులగు రచయితల భాషనో మూలముగాఁ బెట్టుకొని వ్రాసినఁ బ్రయోజనము లేకపోవచ్చును. మఱియొక విషయము. అసలు వ్యావహారికమునకు వ్యాకరణమెందుకు? అన్న ప్రశ్న యున్నది. వ్యావహారికము క్షణక్షణమునకు మార్పులు పొందుచుండును. వ్యావహారికము వ్రాయుటకు వ్యాకరణము చదువవలసిన యవసరములేదు. ఏలన దానికి మూలము శిష్ట వ్యావహారికము. వ్రాయు వానిని శిష్టుండు కాఁడనుట యెట్లు? అతని ప్రయోగములు వ్యావహారిక వ్యాకరణములో సాధింపఁబడనిచో నది వ్యాకరణ లోపమే కాని శిష్టుని తప్పులేదు. గ్రాంథిక భాషావ్యాకరణములు చదివినచోఁ బ్రామాణికభాష వ్రాయు శక్తి లభింపవచ్చును. వ్యావహారిక వ్యాకరణము పఠించినచో గ్రాంథిక వ్యావహారికముల రెంటి స్వరూప మవగతమగును. అని యనవచ్చును. కాని వ్యావహారికస్వరూపము చదివి యవగతము చేసికోవలసిన యావశ్యకత శిష్టునకు లేదు. ఆ భాషాస్వరూప మతనికి సహజసిద్ధము. ఇఁక గ్రాంథికభాష గూర్చి తెలిసికొనుటకు వ్యావహారిక వ్యాకరణము నేల చదువవలెను? ఒకవేళఁ జదివినచో గ్రాంథిక వ్యావహారికముల రెంటి లక్షణముల గజిబిజితో నుభయభ్రష్టుఁడును గావచ్చును. కాదయ్యా! గ్రాంథిక వ్యాకరణము లర్థమగుట కష్టము. వ్యావహారిక వ్యాకరణము సుగమముగా బోధపడును — అందురా? శాస్త్రమే భాషలో వ్రాసినను క్లిష్టత తప్పదు గదా. అది "బాల వ్యాకరణం మేక్ డిఫికల్ట్" అన్నట్లుండక తీరదుగదా. టీక వ్రాయుదుమందురా? వ్రాసినను సులభముగా నెల్లరుఁ దెలిసికొనఁ గలరను నమ్మకమేమి? ఇంతకును శిష్టునకు వ్యాకరణముతో నేమి? శిష్టుల ననుసరించుచు నిరంతరము మార్పు నందవలసినది వ్యాకరణమే కదా? ఈ వాదమును జూడఁగా నేనో కొన్ని సామాన్యసూత్రములఁ నామోదించి యెల్లరు నొకేరీతి వ్యావహారికము వ్రాయునట్లు కృషి చేసిన బాగుండు నేమో!

ఈ విధముగా గ్రాంథిక వ్యావహారిక భాషలు రెండును నవ్యవస్థితములై యున్నవి. గ్రాంథికమున కొక వ్యవస్థ రావలెనన్నచో ముందు ముద్రణములు సుపరిష్కృతములు కావలెను. ఈమహాకార్యమే యొక్క వ్యక్తియో చేయుటకాదు. ఒక పండిత పరిషత్తు బహుతాళపత్రమాతృకా సాహాయ్యమునఁ జేయవలసిన బృహత్కార్యమిది. భాషాభిమాను లీ విషయమును గమనింపవలసినదిగా మనవి.

—: ం :—

# ఉత్తముడి మరణం

"కొలకలూరి"

రేడియో వార్త!

ఉత్తముడు మరణించాడు !!??

ప్రత్యేకభాషారాష్ట్రం కోసం నిరశన వ్రతం సాగిస్తున్న మనీషీమహోదయుడు మరణించాడు.

గుండెల్లో కత్తిపోటు పడితే మాట్లాడుతూ వున్న మనిషి ఆగిపోయినట్లు రేడియో పలకటం మానేసింది.

సైనికాధికారి.

చలించి పోయాడు. కన్నీరు కారింది. మాటలు తడబడ్డాయి. అధరాలు అదిరాయి.

అతని రక్తంలో కరెంటు పోయింది. గుండె మోతల్లో ఉల్లోలకల్లోలినిలో తుఫాను రేగినరోజు వినిపించే ఘోష స్ఫురించింది. ప్రళయకాలంలో ప్రపంచాన్ని నాశనం చేస్తున్న ప్రచండమారుతం పరుగులుపెట్టింది.

సైనికాధికారి కూతురు.

పచ్చిక బయళ్ళలో పడియలనీళ్ళుతాగి పరుగెత్తే చిన్ని లేడిని పంజావిప్పిన సింహం పట్టుకోబోతూవుంటే ప్రకృతి అల్లాడిపోయినట్లు, మదించిన మత్తగజం గాలితాకిడికిక్రింద పడ్డ పూలతీగెను తొక్కుతూ పోతూ వుంటే ఆకాశం కన్నీటితో కేకపెట్టినట్లు, హృదయంలో సుకుమారంగా బాధ పడింది.

సైనికాధికారి భార్య.

నొసటమీద కుంకుమ దిద్దుకుంటూ ఆగిపోయింది. కనుల కొనల కొసల లోనుంచి జలపాతంకంటె వేగంగా కన్నీరు మున్నీరుగా జారిపోయింది. నొసటిమీద తుపాకి చీకట్లో పేలినప్పుడు కనిపించే వెలుతురుగా మెరుస్తున్న చెమటబిందువుల వేడిమిలో కుంకుమ కరిగిపోయింది. జారిపోయింది.

రోడ్డుమీద గుడ్డివాడు బిచ్చగాడు.

నవ్వాడు. విపరీతంగా వికృతంగా విషాదంగా నవ్వాడు. ఆనవ్వులో అనంతప్రపంచ పరమార్థం మిళితంచేసి నవ్వాడు.

ప్రక్కన పార్కులోంచి వచ్చిన రేడియో వార్తవిని లేనిపోని నవ్వు. నవ్వలేని నవ్వు. నవ్వరాని నవ్వు. వెలుగులేని నవ్వు. వెర్రెత్తిన నవ్వు. ఏడుస్తూ నవ్వాడు గుడ్డివాడు.

కళ్ళులేని బిచ్చగాడు కళ్ళున్న సైనికాధికారికి వరండాలో నిలబడ్డప్పుడు రోడ్డుమీద అడుక్కుంటూ కనబడుతూ వుంటాడు,

సైనికాధికారి ఉద్యోగం చేస్తున్న ప్రాంతం తన రాష్ట్రంలో భాగం కాదు. తన భాషా, తను ఉద్యోగం చేస్తున్న ప్రాంతం భాషా ఒకటి కాదు. రెండూ వేరు వేరుగా సంస్కృతులు ఉన్నావి. అవి నిజంగా వేరు వేరు రాష్ట్రాలుగా వుండటానికి అర్హత లేనివి కావు. అయితే ఎప్పుడో ఒకప్పుడు ఏకరాష్ట్రంగా జరిగిన నిర్ణయం ఇప్పటికీ మారకుండా వుంది. మారితే బాగా వుంటుంది.

తను ఉద్యోగం చేస్తున్న ప్రాంతం ఆర్థికంగా కలిగింది. తను పుట్టి పెరిగిన ప్రాంతం నిరంతరం క్షామంతో పేచీ పెట్టుకుంటూ వుంటుంది. శ్రమిస్తున్న ప్రజలు కారణంగా ఆర్థికంగా స్తోమతకల్గి ఈ ప్రాంతం ఆస్తిపాస్తులు ఆ ప్రాంతం వాళ్ళు అనుభవిస్తూ వుండటంవల్ల ఈ జనం యాతన పడుతూ వున్నందున చాలా కాలంనుంచి భాషారాష్ట్ర

విభజన జరగాలని ఆందోళన జరుగుతూవుంది. ఆ ఆందోళన తీవ్రతమ రూపం నిరశనవ్రతం.

విభజనవలన నష్టం పొందేవాళ్లు తన వాళ్ళు. వద్దంటున్నారు. లాభం పొందేవాళ్లు పరాయివాళ్ళు కావాలంటున్నారు. ఈ తన వాళ్ళు పరాయివాళ్ళు అనే ఆలోచన కుంచిత పరిధి సామాన్యుని సంరంభం. సర్వమానవ సమానత్వం విషయంలో ఎవరి కోర్కెలు వారివి. ఎవరి ఆశలు వారివి. ఎవరి అభిప్రాయాలు వారివి. ఒకరిని కాదనటానికి మరొకరికి నైతికంగా హక్కు ఏమీలేదు. న్యాయ దృక్పథంలో తనవాళ్ళు. కాని పరాయివాళ్లు కోరుతోంది ధర్మం సముచితం. ఇది సైనికాధికారిభావన అభిమతం. అతను విశాల భావాల కలయిక కల్ల హృదయుడు. న్యాయం చెప్పటానికి వెనుదీయుడు.

కానీ,

తను గవర్నమెంటు ఉద్యోగి. ఉన్న అభిప్రాయం స్వతంత్ర పౌరుడిలాగా ప్రకటించ కూడదు. ప్రకటించే పక్షంలో అన్యాయమైనా ఏదో బుర్ఖా తగిలించుకొని, మరేదో వేషంవేసి వర్తించటం ఇష్టంలేదు. అతను అభిమతాన్ని వెలిబుచ్చటానికి ఆలోచించవలసిన అగత్యం ఏర్పడ్డ పరిస్థితిలో ఆలోచనే మానేసి నిరామయంగా వూరుకున్నాడు.

అయితే,

పట్టణంలో మంచివాడని అతని విషయంలో ఉన్న అభిప్రాయం. కొందరదంతా నటన అనీ, అతను పచ్చి మోసగాడనీ అందుకే ఇంత అయోమయ పరిస్థితి అభిమతం తెలపలేదు. అనీ ప్రచారం చేశారు.

విభజన కోర్కెలో జరుగుతున్న ప్రయత్నాలు సఫలమవుతూ వుంటే సైనికాధికారి సంతోషిస్తూ వున్నాడు.

సైనికాధికారి ఇంట్లో ఫోను మ్రోగింది.

అందుకున్నాడు.

ఎవరో సబిన్స్పెక్టరు ఏదో సెంటరునుంచి కంగారుగా పిలిచాడు.

ఫోనులో మాట్లాడాడు.

సారాంశం.

ప్రజలు హర్తాళ్ చేస్తున్నారు.

అతను వరండాలో నిలబడి పట్టణాన్ని పరికించాడు.

అల్లకల్లోలంగా వున్న వాతావరణాన్ని గ్రహించాడు.

జనం విపరీతంగా ప్రవర్తిస్తున్నారు. పోలీసు స్టేషనుమీదికి రాళ్ళురువ్వుతున్నారు. అదుపులో పెట్టటానికి మాటలు పనిచేయటంలేదు. అనుమతి ఏమిటి?

సైనికాధికారి సమాధానం చెప్పలేదు.

బంగారు నగల బజారునుంచి ఫోను.

అతను ఆధికారిక ప్రకటన ఆజ్ఞలచేశాడు.

ఎవరికీ ఏ కష్ట నష్టమూ కలక్కుండ చూడాలి.

బ్యాంకునుంచి ఫోను.

జనం హద్దు మీరారు. డబ్బుదోచుకున్నారు. పోలీసులు జోక్యం కలుగజేసుకున్నారు. ఘర్షణ జరిగింది. పోలీసులకే విపరీతంగా దెబ్బలు తగిలాయి. కొంతమందిమరణించే స్థితిలోవున్నారు.

సైనికాధికారి జవాబు.

నేను వస్తున్నాను.

అధికారం తెలియజేసే బట్టలు ధరించాడు.

కలెక్టరు దగ్గిర్నుంచి ఫోను వచ్చింది.

లాఠీచార్జి చేయించమని సలహా.

సైనికాధికారి పట్టణంలోని అన్ని పోలీసు స్టేషన్లకు ఆజ్ఞపంపాడు. లాఠీచార్జీ చేయించండి.

ఫోనులు వస్తూ వున్నాయి.

జనం భూమిలోంచి పొంగిన జలంలాగా అడ్డమాకలు లేకుండా ఉధృతంగా, నిరాఘాటంగా సాగిపోతున్నారు.

విద్యాసంస్థలు మూయబడ్డాయి.

అన్నివిధాల ఆఫీసులూ తాళాలు వేసుకున్నాయి.

పట్టణంలోని సర్వప్రాణుల ఏకైక లక్ష్యం హర్తాళ్!

లాఠీచార్జీ జరుగుతోంది. పోలీసులమీదికి ప్రజలు తిరగబడుతున్నారు. ప్రాణనష్టం జరుగుతోంది. ప్రజలు చనిపోయారు. పోలీసులు చనిపోయారు.

కలెక్టరు సలహా.

కాల్పులు.

సైనికాధికారి నిర్వర్తించలేదు.

కలెక్టరు ఈప్రాంతంవాడు. హర్తాళ్ చేస్తున్న ప్రజలవాడు. సైనికాధికారి పరాయివాడు.

స్వంతవాడు తనవాళ్ళ ప్రవర్తనకు కాల్పులు కోరితే పరాయివాడు నిరాకరించాడు. పెడముఖం పెట్టాడు.

కలెక్టరు విపరీతంగా కోపంలో వున్నాడు. అకలిగొన్న సింహంలా వున్నాడు. పొంగుతున్న సముద్రంలాగా వున్నాడు. లావాలేస్తున్నపర్వతంలాగా వున్నాడు. పగలబోతున్న అణ్వస్త్రంలాగా వున్నాడు.

సైనికాధికారి వినయంగా వున్నాడు. మూర్తీభవించిన అహింసలాగా వున్నాడు. ప్రపంచంలోని యుగయుగాల శాంతం తరతరాల ప్రార్థనతో నెలకొన్న ప్రతినిధిలాగా వున్నాడు. తొణుకూ, బెణుకూ లేని కరుణంలాగా వున్నాడు. నిశ్చలంగా, నిర్మలంగా, సౌమ్యంగా, మృదువుగా, జగదేకధర్మమూర్తిలాగా వున్నాడు.

లాఠీచార్జీ జరుగుతోంది.

ప్రజలు ఎదురు తిరుగుతున్నారు.

జననష్టం కలుగుతూవుంది.

ధనవంతుల మేడలు దొంగిలింప బడ్డాయి.

స్టేషను అగ్నిజ్వాలలకు ఆహుతి అయిపోయింది;

షిప్‌యార్డు నామరూపాలు కనిపించటంలేదు.

బ్యాంకులు పగిలిపోయాయి.

మార్కెట్టు మాయమయింది.

పట్టణం ఆస్తి అంతా కాలిపోయింది.

ఉత్తముడి అహింస వర్ధిల్లాలి!

ఉత్తముడి అహింస వర్ధిల్లాలి!!

ఉత్తముడి అహింస వర్ధిల్లాలి!!!

నినాదాలు దూరంనుంచి వినిపిస్తున్నాయి.

విభజన జరగాలి!

విభజన జరగాలి!!

విభజన జరగాలి!!!

కేకలు దగ్గరవుతూ వినవస్తున్నాయి.

ప్రజలు వెల్లువలాగా పొంగి పొంగి దొర్లి దొర్లి పొర్లి పొర్లి సాగి సాగి పోతున్నారు.

పట్టణంలోకి పోవటానికి సైనికాధికారి సిద్ధమయ్యాడు.

ఫోను వచ్చింది.

కలెక్టరు తన విషయం వ్యక్తంచేశాడు. సైనికాధికారి కాల్పులు సాగించకపోతే తను చేయి చేసుకోదల్చుకున్న విషయం తెలిపాడు.

ఉన్నట్టుండి ఫోన్ కనెక్షన్ తెగిపోయింది.

మేడమీాంచి క్రిందకు దిగబోయే సమయంలో జనం మేడచుట్టూ మూగారు.

అవసరమై, ఆవేశంవచ్చిన జనం అనవసరంగా అరుస్తున్నారు. అడ్డులేకుండా వర్తి

స్తున్న ఆవేశాన్ని అదుపులో పెట్టటానికి, అడ్డులేని ఆవేశంలో అనర్గళంగా ఆ ప్రాంతం భాషలో సైనికాధికారి తన అభిప్రాయం ప్రకటించాడు. శాంతిని కోరాడు. అహింస వర్ధిల్లాలి అన్నాడు. శాంతించమని ప్రజలను సౌమ్యంగా కోరాడు.

అర్థం చేసుకోలేని వాళ్ళకు అర్థమయ్యేట్టు చేసే ప్రయత్నం అనర్థకమయింది.

అరుపులు వినిపించాయి.

అదంతా మోసం.

కుట్ర

వేషం

నటన

జనంలో......

గావుకేకలు

వింత వింత గొంతులు

రకరకాల ధ్వనులు

చిత్ర విచిత్రమైన నినాదాలు.

మేడచుట్టూ వున్న కాపలా పోలీసుదళం ప్రాణరక్షణ అవసరమైన స్థితి మరో ప్రాణి రక్షణకోసం ప్రాణాలభక్షణ లాఠీలతో సాగి స్తున్నారు.

అహింస వర్ధిల్లాలి అనే జనం అహింస ఆశయం అయినా ఉత్తముడి పేరుతో అహింసను సాధించటానికి హింసిస్తూ హింసింపబడుతున్నారు.

సైనికాధికారి వరండాలో నిలబడ్డాడు.

పోలీసులు పడిపోయారు.

జనం వాళ్ళమీదగా నడుస్తున్నారు. మేడ మెట్లు ఎక్కుతున్నారు.

సైనికాధికారి చుట్టూ జనం మూగారు.

వాళ్ళని దగ్గరకు రానివ్వకుండా ఏమో మాటాడుతున్నాడు.

కలెక్టరు కారూ వేస్లూ వేగంగా రోడ్డు మీది ప్రజావాహినిని చీల్చుకుంటూ త్రొక్కుకుంటూ నెట్టుకుంటూ వస్తున్నాయి.

సైనికాధికారి మేడ తలుపులు పగలగొట్టి జనం చొరబడ్డారు.

మేడముందు కలెక్టరు అధికారికంగా నిలబడ్డాడు.

మేడ లోపల్నుంచి నిస్సహాయమైన స్థితిలో ప్రాణరక్షణకోసం ఉన్నతమైన స్వరంతో అరిచే రెండు స్త్రీ కంఠాలు వినిపించాయి.

తుపాకి గుండ్లులాగా అరుపులు హృదయంలో దిగిపోయిన సైనికాధికారి లోపలికి నిరామయంగా క్షణంసేపు చూశాడు.

అప్పటిదాకా సైనికాధికారి దగ్గరకు రాలేని జనం అప్పుడతన్ని చుట్టు ముట్టారు.

కలెక్టరు ఆజ్ఞ.

ఫైర్ !

కాల్పులు ముమ్మరంగా సాగాయి.

మొట్టమొదటి ప్రేలిన తుపాకి సైనికాధికారి గుండెలోంచి రక్తం స్రవించేలా చేసింది.

సైనికాధికారి నిర్జీవంగా కూలిపోయాడు.

కాల్పులు విపరీతంగా జరిగాయి. జనం చెల్లాచెదరై పోయారు.

మేడమీద గదిలో రెండు స్త్రీ శవాలు పడివున్నాయి.

దూరంగా రోడ్డుమీద, కాల్పులు జరుగుతూ వుండనిచోట.

అహింస వర్ధిల్లాలి.

నినాదం వినిపిస్తోంది.

జనం రోడ్డుమీద నిరంకుశంగా నడుస్తున్నారు. విచిత్రంగా అరుస్తున్నారు.

రోడ్డుమీది గుడ్డివాడు బిచ్చమడుక్కోవటం మానాడు. సైనికాధికారి చనిపోయిన

విషయం విన్నాడు. కాల్పులు జరుగుతున్న సంగతి గమనించాడు.

గుడ్డివాడికి కళ్ళు వచ్చాయి.

రోడ్డుకీ పార్కు-గోడకీ మధ్య వున్న మురుక్కాలవ దాటిపోయి పార్కు గోడకానుకొని కూర్చున్నాడు.

మురుక్కాలవ ప్రవహించటానికి కారణమైన మురికి జనం దాటిరాని మురికికి దగ్గరగా, మురికి లేనిచోట ప్రాణాపాయ స్థితి వదిలి ప్రాణరక్షణకోసం కళ్ళు లేని బిచ్చగాడు కళ్ళు తెరుచుకొని కూర్చున్నాడు.

కళ్లు కనిపించని వాడికళ్ళలోంచి కన్నీరు వచ్చింది.

పార్కులో వికసించిన పూలమీద మంటలు మండటం గుడ్డివాడు కళ్ళారాచూ శాడు.

జనం నినాదం చేస్తున్నారు. క్రొత్తవాళ్లు ఏకైక లక్ష్యంలో ఏకాయెకి వెళుతున్నారు.

కాల్పులు సాగుతూ వున్నాయి.

నినాదాలు

విభజన జరగాలి.

అహింస వర్ధిల్లాలి.

తుపాకులు మ్రోగాయి. కాల్పులు సాగాయి

గుడ్డివాడి గుండెల్లో ఏదో గుచ్చుకున్నట్లయింది. గుండెమీద చేతితో తడుముకున్నాడు. తడి అయింది. వళ్ళంతా చెమటతో చల్లబడి తడిసిపోయింది.

జీవితంలో చివరిసారి అతని మనస్సు ఆలోచన,

అహింసా మార్గంలో కార్యసాధనకు పూనుకున్న ఉత్తముడు హింసకు గురి అయ్యాడు.

బుద్ధుడు క్రీస్తు గాంధీ ఇంతే.

అహింసకోసం హింసామార్గంలో, కలెక్టరు..........బ్రతుకుతాడు అనుకుంటూ చావబోతున్న గుడ్డివాడి పెదాలు కదిలాయి.

ఉత్తముడి మరణం.

—: o :—

## సవరణ

జయంతి 16లో ప్రకటింపబడిన మాతృజన్మదినము రచయిత సుప్రసన్న. విలయనృత్యం అనే నాటికకు ఆధారం ఒక ఇంగ్లీషునాటిక.

———

# పతాక వార్త

మాదిరాజు రంగారావు

అర్థరాత్రము కెవ్వున వెర్రికేక
పిండు కట్టిన భయంతో నిశ్శబ్దంగా ఉన్న
ద్యావా పృథివి మనస్సులో వెలుగు రేక

రివ్వున గాలివేసిన ఈలలకు
చివాలున చప్పట్లు చరచినవి చెట్లు

అలలులేని చీకటి నీటిలో
ఒడ్డునుండి ఏదో బరువైన వస్తువు
ఒరిగి పడిపోయిన చప్పుడు
అంతలో నిశ్శబ్దంలో లీనమైనస్థితి.

ఝటిత స్ఫూర్తి కలిగి మేల్కొన్న మనస్సులో
ఒకటి రెండు పురాస్మృతుల కదలిక
కదలిక గుర్తుపట్టి ఎవరో మెల్లమెల్లగా
భయం భయంగా జారిపోయినట్లు గుర్తు

ఎవరో చిత్రవధ చేయబడినట్లుగా
ఉదయాకాశ ముఖంపై పతాకవార్త
వెనుక ఈడ్వబడుతూ వచ్చే శవం
క్రీనీడతో వీధిలో నడుస్తున్న నేను.

—: o :—

# సఫేద్ కాలర్‌వాలా

బదరీ విశాల్

నా పేరు పద్మనాభ్. బాగా లేదను కొంటే మీరు 'ము' తగిలించి నన్ను దాక్షి ణాత్యుణ్ణి చేయవచ్చు. ఉత్తరభారతీ యులకి పేరు తక్కువగా ఉంటుంది కనుక ఉన్నదున్నట్లుగా ఉంచినా నష్టం లేదు.

హిందీలో చెప్పాలంటే నేనొక 'సఫేద్ కాలర్ వాలా'ను. అంటే 'తెల్లకాలరువాణ్ణి' అని అర్థం. ఈ వాలా చూచి నన్ను పార్సీ వాడని అనుకోనేరు! 'సఫేద్ కాలర్ వాలా' అని నేను చెప్పుకోవడమే చిత్రంగా ఉన్నది. కాలర్ తెల్లగా శుభ్రంగా ఉంచుకోవటానికి సబ్బు అవసరం. ఆ సబ్బుబిళ్ళ కొనుక్కోవ టానికి నా దగ్గఱ డబ్బుండదు. కాలర్ చెమ టలో తడిసి, మైలబడి ఎంతగా నల్లబడి పోతుందంటే తెల్లదనం వెదకినా కనిపించదు. చూస్తే వెగటు వేస్తుంది. ఐనా నన్ను జనం తెల్లకాలర్ వాడనే అంటారు. అంటే అన్నారుగాక! నాకూ అలవాటయిపోయింది.

నేను, మా అమ్మ, నాన్న, అన్నగారు, తమ్ముడు, మా ముగ్గురన్నదమ్ముల భార్యలు, అన్నగారి కొడుకులిద్దరూ, నా కొడుకొక్క డూ, తమ్ముని కొడుకులిద్దరూ – అంతా కలిసి పదముగ్గురి కుటుంబం. ఇంగ్లీషు చదువు కున్నవాళ్ళు పదమూడు సంఖ్య చెడ్డదని అంటారు కనుక మా అన్నగారు మా కుటుం బంలో ఉండటానికి నిరాకరించి పిచ్చాసు పత్రికి వెళ్ళిపోయారు. అందుచేత నేమిప్పుడు పన్నెండుగురమే. - అన్నగారటు వెళ్ళటం తోటే నాన్నగారి ఉద్యోగ కాలం సమాప్త మైంది. పింఛనుతో ఎంతవరకని బ్రదుక గలం? నేనందుకొరకే ఉద్యోగం కోసం వెదకు తున్నాను. ఇప్పుడు దానికోసం భూమ్యా కాశా లేకంచేయటం మొదలుపెట్టాను. మా నాన్నగారు కూడా రెండు మూడు చోట్ల ప్రయత్నించారు. చాలా బాధపడ్డ తరువాత తుదకెట్లాగైతేనేమి ఉద్యోగం దొరికింది. మా ఆదాయమంతా కలిపినప్పటికీ ఇంటి వ్యయానికే సరిపోక పోయేది. ఇక పిల్లల చదు వును గురించి ఆలోచించటానికీ వీల్లేదు. అయినా నాన్నగారు ఎప్పుడూ వాళ్ళ చదు వును గురించి ఆలోచించేవారు తుదకొనాడు. ఆయన అననే అన్నారు. 'పద్మం, ఎట్లాగో పిల్లల చదువును గురించి ఏర్పాటుచేయి. లేకపోతే నేనూ ఓ ఉద్యోగం వెదుకవలసి వస్తుంది. నేను సగం కడుపుకు తిని మిమ్ము చదివించానన్న మాట జ్ఞాపకముంచుకో.' సరే! పిల్లల చదువు మొదలైంది. నాభార్య సణుగులూ గొణుగులూ కూడా ఆరంభ మైనది. 'తమ్ముడైతే తిని కూచుంటాడు. ఉన్న బరువంతా మీరే నెత్తిన ఎత్తుకుంటారే'మని. నా తమ్ముడు ఉద్యోగం కోసం చాలా ప్రయ త్నించాడు. అయినా దొరకలేదు. దొరకే అవకాశం కూడా కనబడలేదు. ఈ ఉద్యోగం దొరకక పోవటం వాని దోషంగా పరిణమించి ఇంట్లో కలహాలెక్కువై వాడు మనస్సు చెడి ఒకనాడు ఇల్లువిడిచి వెళ్ళిపోయాడు. ఎంత వరకుద్యోగంలో చేరి ఎంతో కొంత సంపా దించడో అంతవరకు ఇంట్లో అన్నం తిన కూడదనే నిశ్చయంతో. వాని ఉద్యోగం కోసం నేను ప్రయత్నం చేశాను. నాన్న

గారు ప్రయత్నం చేశారు. అయినా దొరక లేదు.

నేనింతవరకు సద్బుద్ధితో పనిచేసేవాణ్ణి. సత్యంగా మెదలేవాణ్ణి. పై అధికారుల పాదాలకు మడుగు లొత్తలేదు. వాళ్ళను స్తోత్రం చేయలేదు. ఈ గుణాలు కారణంగా కాబోలు నన్ను 'ఎఫిసెంట్' కాదన్నారు. నా తరువాత ఉద్యోగంలో చేరినవారి జీతాలు పెరిగినవి. నాజీతం పెరుగలేదు. నేనాలోచించసాగాను. లోకమంతా ఒక మార్గంలో పోతుంటే నేనింకో మార్గంలో ఎందుకు పోవాలని. లోకంలో చాలామంది స్తుతిప్రియులు సరే! నేనూ ఆదేవిని ఆరాధించటం మొదలు పెట్టాను. ఆదేవి చాలా తొందరగా ప్రసన్న మైంది. కొద్దిరోజుల్లోనే జీతం పెరిగింది. నేనిప్పుడు దొరగారిదగ్గఱకు ఏఆటంకం లేకుండా వెళ్ళగలను. ఆయన స్టాఫ్‌లో నేనిప్పుడు పరమయోగ్యుణ్ణి, నిపుణుడను, బుద్ధిమంతుడను, యోగ్యత, నైపుణ్యం, బుద్ధిమత్త్వం, వీటి సర్టిఫికేట్ సాధించటానికి కొన్ని మెట్లెక్క వలసి యుంటవి. ఈ మధ్య ఢిల్లీలో ఒక పని సఫలమైంది. అందులో నావల్ల 'స్వామి'కి చాలా లాభమైంది. అందువల్ల యోగ్యత్వ, నిపుణత్వ, బుద్ధిమత్త్వములతోపాటు విశ్వాస పాత్రత్వపు డిగ్రీ కూడ నాకు లభించింది. నాకు తెలిసిన ఒక వ్యాపారివద్ద నేను మా తమ్మునికి ఉద్యోగం ఇప్పించాను. ఆయన దగ్గర ఖాళీ లేనప్పటికీ ఈ ఉద్యోగం మా వాడికిప్పించాను.

ఇంతింతైతే మా అన్నగారికొడుకు మెట్రిక్ పాస్ అయి గుమాస్తాగిరీకి పనికి వచ్చే అంత గొప్పవాడయ్యాడు. వానికి కూడా క్లర్క్ ఉద్యోగం ఇప్పించబడ్డది. ఇక మా నాన్న గారికి మనుమని పెండ్లి చింత పట్టుకొన్నది. చావక ముందు మనుమరాలు ఇంటికి వస్తే చూచిపోదామని ఉందిరా అనేవాడు. పెండ్లి ప్రయత్నాలు మొదలైయినవి. అంటే కనీసం ఐదువేల రూపాయలు ఎక్కడ నుంచైనా తెచ్చే బాధ్యత నా నెత్తిమీద పడ్డదన్న మాట. భార్య మాతి మళ్ళీ ముడుచుకొన్నది. 'ఇప్పటికీ అంతా మీరే చేయాలేమిటి? ఇప్పుడైనా తమ్మునికి చెప్పండి. నిక్షేపంలాంటి ఉద్యోగం ఇప్పించారు. ఆయనా కొంత డబ్బు తేకూడదూ? ఆయనకేం మహారాజు. భార్యను పెట్టుకొని బెంగుళూరులో కూచున్నాడు. ఇక్కడ తల్లిదండ్రులూ, వదినెగారు అందరి కర్చూ మీ నెత్తిమీదనే పడుతుంది. క్రిందటిసారి మీ తమ్ముని భార్య వచ్చినప్పుడు చూచాను. చక్కని సిల్కుచీర కట్టుకొంది. ఇన్నేండ్లనుంచి నేను సిల్కుచీర మొగమైనా ఎరుగను. అని ఒక ఉపన్యాసం. రోజూ చెవిలో రొద, తుదకు నేను తమ్ముని కుత్తరం వ్రాశాను. జవాబీవిధంగా వచ్చింది.

పూజ్యపాదులకు

సమస్కారాలు.

మీ ఉత్తరం చేరింది. కేశవుని పెండ్లి వచ్చేనెల ౧౫ తేదీకని తెలిసి చాలా సంతోషించాను. పెళ్ళిఖర్చు విషయంలో మీరు వ్రాసిన మాట నిజమే. నేను మా ఆఫీసులో అప్పుకోసం అర్జీ పెట్టుకొన్నాను. (౫౦౦) ఇవ్వాళ రేపు మా ఆఫీసువాళ్లు అప్పులివ్వటం పూర్తిగా మానుకున్నారు. అందువల్ల అర్జీ మంజూరవుతొందనే ఆశ లేదు. అయినా మన శక్త్యానుసారం ఖర్చుపెట్టుకోవాలి తప్ప ఐదువేల అవసరమేమిటి? మీరు నాన్నగారిని ఒప్పించండి. ఐదువందలైనా ఐదు వేలైనా మీరే ఏర్పాటు చేయవలసి ఉం

టుంది. ఇట్లాంటి సమయంలో సహాయపడ జాలసందుకు నాకు చాలా సిగ్గుగా ఉన్నది. నా వివశత్వాన్ని గుర్తించి మీరేమీ అనుకోకుండా క్షమిస్తారని ఆశిస్తున్నాను.

ప్రమీల గర్భవతి. పెద్దవాడు పరీక్షలో మంచిమార్కులు తెచ్చాడు. పైక్లాస్‌కు పోతే ఫీస్‌కూడా ఎక్కువౌతుంది. సుమతి, శాంతి, ఇద్దరూ సంవత్సరమల్లా ఆరోగ్యం చెడి కూచున్నారు కనుక చాలా డబ్బు ఖర్చుపడ్డాను. చంటిపిల్లవాని ఆరోగ్యం కూడా సరిగాలేదు. అక్కడ అందరూ క్షేమంగా ఉన్నారని ఆశిస్తున్నాను. పెద్దలకు నమస్కారాలు, పిల్లలకు ఆశీస్సులు.

విధేయుడు,
బాబు.

తా : క : నేను క్రాస్‌వర్డ్ పజిల్సు నింపి పంపాను. ముప్పదివేల ప్రథమ బహుమానం తప్పక నాకే వస్తుందనుకొంటాను. ఆ డబ్బు వస్తే మీకు పంపిస్తాను పెండ్లి గొప్పగా జరుపవచ్చు."

తరువాత నేను కేశవునికి ఉత్తరం వ్రాశాను వాని పెళ్ళి తేది తెలుపుతూ. వాని జవాబు ఇంగ్లీషులో వచ్చింది. దానికి తెలుగిది.

"డియర్ అంకల్.

మీ ఉత్తరం చేరింది. వచ్చేనెల పదిహేనవ తేదీ నా పెండ్లి అని నిశ్చయించామని వ్రాశారు. తేదీ నిశ్చయించక ముందు నన్ను డుగనైనా లేదు. ఇంత కొద్దికాలంలో నా స్నేహితురాండ్రందరినీ విడిపించుకోటం ఎట్లా. వాళ్ళంతా ఏమనుకొంటారు ? వాళ్ళలో ఒకరైకు నేను పెండ్లి చేసుకొంటానని 'ప్రామిస్' చేశాను. ఆమెను 'లవ్' చేశాను. సరే! మీ ఆజ్ఞాప్రకారం ఐదవ తేదీకి వస్తున్నాను. కాని నేను పెండ్లిసమయంలో ధోవతి కట్టుకోను. ఇక్కడి వాళ్లంతా సూట్ తొడుక్కునే పెండ్లి చేసుకొంటారు. మీరనుమతిస్తే ఇక్కడ ఒక సూట్ - పీస్ కొనుక్కొని సూట్ కుట్టించుకొంటాను. బొంబాయిలో కుట్టుకూలి ఎక్కువే కాని కుట్టటం చాలా బాగుంటుంది. నాలుగు వందలలో సూట్ రెడీ అవుతుంది. సూట్‌కోసం డబ్బు టెలిగ్రాం ద్వారా పంపించండి. అయితేనే ఐదవ తేదీవరకు సూట్ కుట్టించి వెంట తెచ్చుకో గల్గుదును. డబ్బు రానటంలో ఆలస్యమైతే బహుశః ఐదవ తేదికి రాలేను.

జవాబు తొందరగా వ్రాయండి.

మీ,
కేశవ్.
( అనూదితము )

—: o :—

## ఆకాశవాణి

"తమగొంతే తాము ఆకాశవాణివారు గుర్తించుకోలేనంత ఘోరంమరొకటిఉండదు" అని క్రితంసారి వ్రాసాను. తమ నిర్ణయాలే తమకు ఆకాశవాణివారికి గుర్తుండక పోవడం మరీఘోరతరం అని ఈసారి వ్రాయవలసి వస్తున్నది. ఎందుకో చెబుతాను. ... ప్రతి సంవత్సరం ఆకాశవాణివారు అంతర్విశ్వవిద్యాలయ నాటికల పోటీలు కొన్నేండ్లనుండి నిర్వహిస్తున్నారు. గతసంవత్సరం (1959 – 60) కూడా అలాగే నిర్వహించారు. వీటిలో వి. పి. రమాదేవిగారి 'మారిన విలువలు' అన్న నాటిక (2 వ ఫిబ్రవరిన హైద్రాబాదు నుండి ప్రసారమైంది)కు ప్రథమ బహుమతి వచ్చింది. శుభం. అయితే 1957 – 58 సంవత్సరపు పోటీలో కొలకలూరి ఇనాక్ గారి 'దృష్టి' అనే నాటిక (అది ఆరోజుల్లో ప్రసారం చేయబడింది)కు ద్వితీయ బహుమతి వచ్చింది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే—'దృష్టి' యొక్క కథాభావమే సంపూర్ణంగా 'మారిన విలువలు'లో ఉంది. దీనిలో ఆ కథా నిర్వహణ 'దృష్టి'లో కన్నా బలహీనంగా ఉంది. అయినా దృష్టికి ద్వితీయ బహుమానం, తదాధారమైన దానికి ప్రథమ బహుమానం. కనీసం బ ళనాటికలతో శ్రవణమాత్రపరిచయమన్నా లేనివారిని నిర్ణాయకులుగా వేసుకుంటే ఇంతకన్నా మంచి నిర్ణయం ఎల్లా జరుగుతుంది? ఇంకో ఏడాది మధ్యవిరామంతో (1961 – 62లో) ఈ 'మారిన విలువలు' పై ఆధారపడ్డ నాటికకు మహోత్తమబహుమతి ఈయబడవచ్చు. ఇటు ప్రసారకులూ, అటు నిర్ణాయకులు కూడా మరీ బేపర్వాగా ఉండడం ఆకాశవాణి దుర్దశ. 'బహుజన హితాయ – బహుజన సుఖాయ' అని ఆకాశవాణి స్థిరచిహ్నంలోని నినాదానికి ప్రమాదమే కలుగుతున్నది. ఏదో రేడియో కొనుక్కున్నాం కాబట్టి, సంవత్సరం ఒక్కంటికి పదిహేను రూపాయిలు పన్ను చెల్లించు కొంటున్నాం గాబట్టి – కనీసం సిలోను పాటలో, లేక దాన్ని అనుకరించే పంచరంగీ పాటలో వినడానికి తప్ప–సాహిత్య విషయకంగా ఏమైనాలాభం పొందగలిగామా అంటే ఉట్టిది. మృదువైన కంఠస్వరం, లేక మధురంగావుండే గానం చెవులకేమైనా సుఖాపాది అవుతే కావచ్చు కాని, సాహిత్యాదుల దృష్ట్యా హితం కలిగించేట్టు మాత్రం ఆకాశవాణి ప్రసారాలు లేవు.

ఆకాశవాణిని ప్రచారానికి బహుళంగా వుపయోగిస్తున్నారు. అభ్యంతరంలేదు. ఇంత ఖర్చుపెడుతున్న ప్రభుత్వం ఆ అవకాశాన్ని ఎల్లా జారవిడుచుకుంటుంది? గ్రామస్థుల కార్మికుల కార్యక్రమాదులు వాటితో ముమ్మరంగా నిండిపోతున్నాయి. అయితే అచ్చంగా చక్కని నాటికలకోసం, ప్రసంగాలకోసం వినియోగించే అల్పకాలంపైకికూడా వాటిని దండెత్తిస్తే ఎల్లా? ప్రచారంచేయడంలో కూడా లోపాలున్న నాటికల్ని ప్రసారంచేస్తే, ప్రభుత్వపు ఇంత ఖర్చున్నూ బూడిదలో పోసిన పన్నీరు. 26 వ జనవరిన 'నే నొక్కడనే కాను' అన్న దాశరథిగారి నాటిక హైద్రాబాదునుండి ప్రసారమైంది. ఉద్యోగం చేయకుండా దేశసేవ చేద్దామనిబయల్దేరిన కుర్రాడు పార్థసారథి – కథ. అందులో ఒక ముఖ్యమైన నాయక సంబంధిలోపం చూడవచ్చు.

నాటికలో సార్థసారథికి పాతికేళ్ళు వున్నట్టుగా నిశ్చయం చేయబడింది. అతడు స్వాతంత్ర్యోద్యమ సందర్భంలో స్కూళ్ళెగ్గొట్టి పోలీసుల దెబ్బలుతిని జైళ్ళల్లో పడ్డాడుట. స్వాతంత్ర్యం 1947 లో వచ్చింది. వచ్చి పదమూడేళ్లైంది. ఆనాటికి సారథికి పన్నెండేళ్లు కూడా పూర్తిగా నిండివుండవు. చదువులకు పట్నంవెళ్లే వయస్సుకూడా కాదది సరిగ్గా. మరి స్కూళ్ళెగ్గొట్టి, పోలీసుల దెబ్బలు తిని ఆ వయసులో జైళ్ళల్లో ఎలాపడ్డాడో అర్థం కాదు. ...సారథికి విధవ మరదలుంటుంది. ఆవిడని తాను పెళ్లాడితే, తనకు మోహం కామం తప్ప సేవాభావం లేదనుకొంటారు లోకులు అని అంటాడు సారథి. ..సేవాభావం అల్లాఉంచండి. విధవా వివాహాన్ని – మరీ బ్రాహ్మణ్యంలో– ఈనాటికీ పల్లెలు నిరసించి సేవాభావ ప్రసక్తిలేకుండానే – నీచంగా చూస్తాయి, చూస్తున్నాయికూడా. అన్ని బంధాలూ వదులుకొని దేశసేవకు పూనడం గ్రామోద్ధరణ చేయడానికి ప్రతిజ్ఞచేయడం – ఈ నాటికలో ముఖ్యం. నాటిక మొత్తం మీద పర్యవసానం సుఖవంతంగా వుంటుందని పించదు. ఆ సేవకు ఈ పెళ్ళి అడ్డంకి లేకున్నా అతని తండ్రే అడ్డంకి. అడ్డంకులు దాటడం చిత్రిస్తేనే ప్రచారం సంపూర్ణమవుతుంది.... అసలు పేరుకుతగ్గ నాటికకాదు...నేపథ్యంలో పద్యపఠనం మరీ అప్రశస్తమయింది.

పైదానికి మల్లెనే పేరుకుతగని నాటిక ఆనాడే అదే కేంద్రంనుండి ప్రసారితమైన నాయని సుబ్బారావుగారి 'ఇంద్రధనుస్సు'. 'రిపబ్లిక్ డే' అంటే ఏమిటో తెలియని కొందరు కార్మికులు. తెలిసిన వ్యక్తిద్వారా తెలుసుకొంటారు అంతే. ఇక్కడొకటి. ఆనాడు వుదయం కార్యక్రమ వివరణలో దీన్ని కదంబ కార్యక్రమం అన్నారు. 'వాణి'లో వినోద కార్యక్రమం అన్నారు. ఈ రెంటికేమి పొంతనో? అయితే అసలు కదంబమూ లేదు, వినోదమూ లేదు. ప్రచారమే ఉంది. సంభాషణలు అందంగా ఉన్నాయి.

ప్రతి శనివారంనాడు రాత్రి 9–15 నుండి పదిహేను నిమిషాలు 'హాస్యవల్లరి' కార్యక్రమం కోసంగాను కేటాయింపబడనవి. అయితే, అందులో 23, 30 జనవరి, 13 వ ఫిబ్రవరి (శనివారాలు) ఆ హాస్యవల్లరికిగాను వరుసగా 'నేతాజీ సుబాస్‌చంద్రబోస్' అనే పేరి పరిచయ కార్యక్రమం, 'చిరంతనసత్యం' అనే పేర 'మహాత్ముని మహనీయస్మృతి', 'రమణీయమైన వీణ' అనే పేర సరోజినీ నాయుడు పరిచయకార్యక్రమమూ ప్రసారమైనాయి. ఆ మహానాయక, నాయికల పరిచయానికి హాస్యవల్లరి సమయంతప్ప మరోటి దొరకలేదేమో ఆకాశవాణి వారికి పాపం! అకాలప్రసారితులైన ఆ వ్యక్తులుహాస్యప్రాయులైనారు!... ఏ లలితసంగీత కార్యక్రమం తప్పించినా...మరేది తగ్గించినా బాగుండేది. దొరికిందే సమయం అన్నట్టు చేస్తున్నారు ఆకాశవాణి వారు... ఇక మరోటి. 6 వ ఫిబ్రవరిన మునిమాణిక్యం వారి 'తెరపై కలకలం' అన్న హాస్యనాటిక ప్రసారమైంది. అయితే పదిహేను నిమిషాల కొదగలేదు. ఆ పుణ్యకాలం పూర్తయ్యేప్పటికి నాటిక అసంపూర్ణంగానే ఉంది. ముందే గమనించక పోవటంవల్ల ఈ స్థితి పట్టింది. ఆకాశవాణి నిర్వాహక రచయితలే కాలపరిమితిని సరిగ్గా గమనించకపోవడం శోచనీయం. ఇల్లాంటి శోచనీయఘట్టాలు ఆకాశవాణి జీవితాన బహుళం.

కొన్ని నెల్ల క్రితం సి. నారాయణరెడ్డిగారి 'తెలంగాణం' అన్న దేశ పరిచాయకమైన నాటిక ఒకటి ప్రసారమైంది హైదాబాదు నుండి. అదిచూచి విజయవాడవారు తా మెందు కూరుకోవాలన్నట్టు 'మాతృదేశ సందర్శనం' అన్న శీర్షిక క్రింద 'రాయలసీమ' 'సాగరాంధ్రం' అన్నవి రెండు రాయించి ప్రసారంచేసారు. (13 వ జనవరి, 3 వ ఫిబ్రవరి) నారాయణ రెడ్డిగారు ప్రతిభావంతులు కాబట్టి వింజమూరివారి నాటికన్నా బాగా వ్రాసారు. అది చూచివ్రాసినా ఇవి కుదరలేదు. ఇల్లాంటి కార్యక్రమాలు అశ్రద్ధతో వ్రాస్తే చెడిపో తాయి. సాగరాంధ్రంలో ఓడ రేవుల్ని పేర్కొంటూ మోటుపల్లిని విడిచేసారు. నిర్వహణైనా సరిగా లేదు. 'శ్రీవాణీ'–'శ్రీయన' అన్న పద్యాలపఠనం అధ్వాన్నంగా ఉంది. భద్రాచల విషయం 'తెలంగాణం'లో చెప్ప బడింది. మళ్ళీ ఇందులో పిష్టపేషణం. ఇంత టితో మాతృదేశ సందర్శనంఅయిపోయింది. ఇక బుధవారపు నాటికాకాలాన్ని, మాతృ జిల్లా, మాతృతాలూకా, మాతృపట్టణ, మాతృపల్లి దర్శనాలు ముందుముందు ఆకాశ వాణివారు ప్రసారంచేయవచ్చు.

పైనకొన్నింటినిపరిచయ కార్యక్రమాలు గా పేర్కొన్నాను. కాని వాటన్నిటినీ ఆకాశ వాణివారు నాటికలన్నారు, '– దర్శనా' న్ని కూడా. నాటికలిల్లా ఉండవనీ, ఉంటేనాటి కలు కావనీ ప్రతిసారీ చెప్పడం 'బధిరశంఖా రావం'... ఇదివరకోసారి 'క్షేత్రయ్య' – సంగీతనాటిక అని శాస్త్రీయసంగీతం వినిపిం చారు మద్రాసు కేంద్రం. దాని అడుగుజాడల్లో విజయవాడ కేంద్రం. 'ఎవరని నిర్ణయించేదిరా' అనేశీర్షికతో 27వ జనవరిన శాస్త్రీయసంగీతం వినిపించారు. ఆనాడు అన్నిపాటలకూ రచ యిత సమానుడు. ఈనాడు స్తుత్యం సమానం. అంతేతేడా. ఈ మహా 'నాటిక'కు బూర్గుల రామకృష్ణరావుగారిప్రారంభవచనాలు. వారిని ఆహ్వానించికూడామంచి ప్రసంగాన్ని, శ్రోతల కందించే అవకాశాన్ని చేతులారా వదులు కున్న ఆకాశవాణివారి నేమనాలి? ఈ 'సంగీత నాటిక' బురఖావేసుకొన్న శాస్త్రీయ సంగీ తాన్ని సమర్పించింది నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు. ఆకాశవాణి వారికి పట్టి ఆర్భాటంతప్ప అంతస్సత్వం గోచ రించదు.

రసమయి, సాహిత్యనందినులగూర్చి క్రితం సారే చెప్పాను. ఈ సారీ అంతే. త్యాగరా యోత్సవాలొచ్చినా, మద్రాసులో ఏసంగీత సభలు జరిగినా, తిరుచ్చి, బెంగుళూరుల్లో జరిగినా వీటికి ఆయువు మూడుతుంది. అల్లా హాతిశేషమైన ఒక సాహిత్యనందినిలో 9వ ఫిబ్రవరిన కుందుర్తి ఆంజనేయులుగారి "ఇవ్వా ళైతే పురవర్ణన" అన్న ప్రసంగం ఫరవాలేదని పించింది. ఇల్లా ఎందుకంటున్నానంటే, సాహిత్య ప్రసంగాలకోసమైన రసమయి సాహిత్య నందిని కార్యక్రమాల మీాదిగా అతిగాదంటే తి వచ్చేనాటికలు కథలు ఆగి, ప్రసంగంవచ్చింది. నయం కాదూ!... మొదట కొంత ఎగుడుదిగు డుగానడచినా మొత్తానికి బాగుంది ప్రసంగం. అసలు విషయంలో ముఖ్యమైన బలహీనత ఏమంటే, ఆధునికంగా పురవర్ణన అంటూ ఏ శ్రీమద్రామాయణకల్పవృక్షంలోనో తప్ప మరెక్కడా కనుపించదు. అందుకని ప్రసంగ కర్త–విచారసహితంగా ఆకాశవాణివారాశీర్షిక నిచ్చినా–ఏదోవిధంగా ఒక కొలిక్కి–విషయాన్ని చేర్చారు. దీన్నిబట్టే ప్రసంగాంతంలో ఆధునిక కథాకావ్యాలు విరివిగావస్తే తప్పనిసరిగా ఈ విషయం తేలదన్న భావం వ్యక్తీకరించబడింది.

'కర్ణునితో ద్రౌపది సంభాషణ' వంటి ప్రసంగాదుల విషయాలు నిర్ణయించే ఆకాశవాణి వారికి పైరకమైన విషయం ఒకలెక్కలోనిదా!

21వ జనవరిన మద్రాసునుండి రూపాబాయిమోతీలాల్‌గారి 'విశ్వనాథ నాయకుడు' అన్న నాటిక 'శుభ' నిర్వహణలో ప్రసారమయింది. అది 'గ్రాంథికభాష'లో వ్రాయబడింది(!) శబ్దసాధుత్వం తెలియకుండా గ్రాంథికభాష జోలికెందుకు పోవడం? ఎల్లా అన్నా వ్యాకరణం తయారయ్యే వ్యావహారికభాష ఉండనే ఉందిగదా. ఆ వ్రాసినవారు వ్రాసినా ఆకాశవాణి వారు ఎల్లా ప్రసారంచేసారని అనరాదు. వారు భాషాతీతులు. భావాతీతులు. 'మనోనిబ్బరం' మనోదృఢాన్ని లాంటి కర్ణకటు శబ్దాలు బహుళంగా శ్రోతలీ నాటికలో వినవచ్చు. చెడినవాచికం ఎల్లా ఉంటుందనడానికి ఇదొక్కఉదాహరణ. పాఠం అప్పచెప్పినట్టుండే సంభాషణావాక్యాలు వినాలంటే ఇందులోని విశ్వనాథుని భార్య వాచికంవింటే చాలు...కథానిర్వహణలో క్రొత్తదనంలేదు వట్టి పిష్టపేషణం...ఇదిబహుజనహితాయ...

"సమూహంలోమనిషి" అనే శీర్షికకింద నగరవాణి కార్యక్రమంలో కొన్ని ప్రసంగం లాంటి నాటికలు, నాటికల్లాంటి ప్రసంగాలు ప్రసారం చేస్తున్నారు. 23వ జనవరిన "సమూహంలో మనిషి : కవి" ప్రసారమైంది. కవి పేరు శాస్త్రాలమని పెట్టడంఅస్వాభావికత కల్పించడ మవుతుంది. విషయాన్ని హాస్యప్రాయం చేయడమే అవుతుంది. విషయంకూడాఅల్లాగే వుంది. దానికి తగ్గట్టు వాచికహాస్యాన్ని కల్గిస్తున్నామనే ఉద్దేశ్యంతో అసహ్యాపుచారు కంఠధారులు, ఒక్క కవిభార్య తప్ప. మరిల్లాంటివి ప్రసారంచేసి ఆయా వారికి అపచారం కల్గించడమెందుకు? ఎందుకనే ప్రశ్న ఆకాశవాణివారికి అసలు కలుగదేమో!

26వ జనవరిన "రిపబ్లిక్‌డే"ను పురస్కరించుకొని జాతీయకవిసమ్మేళనం జరిగింది. దీనిలో పధ్నాలుగు భాషలవారూ పాల్గొన్నారు. అయితే పధ్నాలుగు భాషాకేంద్రాల్లో ఈ కవితలను వారి వారి భాషల్లోకి అనువదించారు. మూలాన్ని ఒక నిమిషం రుచిచూపించి అనువాదం చదివారు. పూర్వం ఢిల్లీనుండి వినిపించినప్పుడు మూల రచనలను కూడా పూర్తిగా వినిపించి హిందీ అనువాదాన్ని వినిపింప చేసేవారు. ప్రాంతీయ లెందుకాపద్ధతి వదిలారో అర్థంకాదు. మూలరచయితద్వారా అతని రచనను వినే అవకాశం శ్రోతలకు లేకుండా పోతోంది దీనివల్ల... ఈ సమ్మేళనంలో తెల్గు ప్రతినిధిగా ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు పాల్గొన్నారు. 14 రచనల్లోనూ ఏరెండో తప్ప, మిగతా అన్నింటి వలెనే తెలుగుకూడా సామాన్యస్థాయిని కవితలో అతిక్రమించ లేకపోయింది. బాగున్న రెండు అస్సామీ, కన్నడ కవితలు. అను: పుట్టపర్తి, విశ్వంగార్లు. ఉర్దూ కవిత్వానికి ఆలూరి బైరాగిగారు అనువాదకులు. అనువాదానికికూడా వ్యాఖ్యానం అవసరమైంది. ఏంచేస్తాం. ఆ అనువాదం పద్యాల్లోకన్నా వచనంలోచేస్తేనే బాగుండేది. ఒక్కమాట. అఖిలభారత కార్యక్రమాల్లో సంగీత కార్యక్రమంతప్ప అన్నీ మిగతాభాషలలోకన్నా తెలుగులో అధికకాలాన్ని తీసుకొంటుంది. దీనికి కారణం దురూహ్యం.

పూర్వులనీ, మహాకవులనీ వదిలేస్తున్నాంగాని, నన్నయాదులలో ఎన్ని వ్యర్థపదాలున్నాయో మనం ఆలోచించడమే లేదు. యతిప్రాసలకోసం గణాలకోసం వారు ఉప

యోగించిన వ్యర్థపదాలకు అంతేలేదు. ఈ విషయం మార్చి 8 వ తేదీన హైద్రాబాదు నుండి ప్రసారం అయిన 'ఊతపదాలు - వ్యర్థ పదాలు' అన్న ప్రసంగం వింటే అదంతా తెలుస్తుంది. విన్నారా? వినకుంటే కొన్ని 'బంగారు మాటలు' వినిపిస్తాను. నన్నయ గారు వ్రాసిన "సారమతిం గవీంద్రులు...' అన్న పద్యంలో"...ప్రసన్న కథాకలితార్థ యుక్తిలో నారసి" అనే సందర్భంలోని 'లోన్ (లోనారసి) వ్యర్థపదం అంటారు ప్రాసంగికులు. 'మతినూహించు' మతిలో కాకుంటే ఎక్కడ ఊహిస్తారు! అంటారు. "మదమాతంగ తురంగ కాంచన లసత్ మాణిక్య గాణిక్య సంపదలోలిన్ గొని తెచ్చియిచ్చిరి." అన్న పద్యంలో 'లసత్' 'ఓలిన్' అన్నవి వ్యర్థాలంటారు. ఇంకా ఇల్లాగే చాలా చాలా అన్నారులెండి. అయితే 'కొని తెచ్చి' ఎందుకు, ఉట్టి 'తెచ్చి' చాలు, 'కొని' వ్యర్థం అని అనలేదు. ఎందుకో మరి. ఈ సారెప్పుడైనా అంటారేమో? 'లోనారసి' అన్న చోట 'లోన్' ఎల్లాగూ వ్యర్థపదమే అన్నారు గదా. మరి ఆరసి ఎందుకు? "అరసి" అంటేనే చాలు. ఆరసి అన్నది పద్యగణపూర్తి కోసం దీర్ఘాదిగా ఉపయోగింపబడింది. నిజానికి ఆ దీర్ఘం వ్యర్థం అని కూడా అనవలసి ఉండె, కాని అనలేదు. "వ్యర్థవర్ణాలు" అనే శీర్షిక ఈసారి ఇల్లాంటివన్నీ వారు అంటారేమో, తెలియదు...ఈ రకమైన "విమర్శా ప్రసంగం" ప్రసారం చేసిన ఆకాశవాణి వారి సాహిత్యసేవ ఎంతదో, ఎల్లాంటి ఉద్దేశ్యం గలదో అర్థమవుతున్నది. పూర్వసాహిత్యమంతా ఉపద్రవకరమైంది; అది ఒక్కసారి నశించాలి అనే మనస్తత్వం గలవారి ప్రసంగాలు ప్రసారంచేసి సాహిత్యాభివృద్ధికి ఆకాశవాణి వారు ఎల్లా ఉపయోగపడుతున్నారో సాహిత్య సక్తులకే తెలుసు. ఇంతకూ ప్రాసంగికులెవరో తెలుసా? శ్రీ తాపీ ధర్మారావుగారు.

తరగతి గదిలో విద్యార్థి విషయ జ్ఞానం కోసం ప్రశ్నలువేసి సమాధానాలు ఉపాధ్యాయునిద్వారా పొందటం నాటిక కనుక అయితే, శ్రీ తిరుపతి వెంకటకవుల స్మృత్యర్థం 25 వ ఫిబ్రవరిన విజయవాడనుండి ప్రసారమైన "శతావధాన సరస్వతి" నాటిక అవుతుంది. ఆ కవుల పద్యాలు - అక్కడక్కడివి, నిజానికి శతావధానాలలోనివి "అతి తక్కువ" ఆశువుగా చెప్పినవి "అతి ఎక్కువ" వినిపించడం తప్ప, అదీన్నీ తిరుపతిశాస్త్రి గారు యతిప్రాసల దగ్గర మహాసంకట పడ్డట్టు సూచించే విధంగా వినిపించడం తప్ప, అందులో ఉన్న విశేషం మరేమీ లేదు. కనీసం వారి జీవిత విశేషాలైనా సరిగా చెప్పబడలేదు. వారి అన్యోన్యమైత్రి కూడా వివరింపబడలేదు. చివరకా పృచ్ఛక "విద్యార్థి" మాష్టారూ అని సంబోధించి పింగళి లక్ష్మీకాంతంగారిని, వారు వెంకటశాస్త్రిగారి బ్రహ్మైక్య సందర్భంలో వ్రాసిన పద్యాలను చదువమని కోరుతాడు. ఒకసారి చదువబడుతాయి. "వన్స్‌మోర్" అన్నంత పని చేస్తాడు పృచ్ఛకుడు. మరోసారి చదువబడుతాయి. ఈ మరోసారి ఎందుకు. దానికి బదులు కాటూరి వెంకటేశ్వరరావుగారి పద్యాలు వినిపిస్తే బాగుండేదిగదా. ఎందుకంటే ఈ "నాటిక" అనబడ్డదాన్ని వ్రాసిన వారు పింగళి కాటూరి - ఇద్దరూ. ఇందులో ఫలపక్షం దేనికి?

ప్రసారం చేసిందాన్నే తిరిగీ ప్రసారం చేస్తే - శ్రోతల విషయం ఎవడిక్కావాలి -

ఆకాశవాణి వారికి లాభంగదా. మార్చి 5వ హాస్యవల్లరి కార్యక్రమంలో "ఇద్దరు సత్యవాదులు" ఇదివరకు ప్రసారమైందే. అది దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి రచన. ఈమధ్య ప్రసారమైన వారివన్నీ దాదాపు ఇంతకుముందే ప్రసారమైనవి. అయితే కృష్ణశాస్త్రిగారు క్రొత్తవి రాయలేరనీ, వ్రాయరనీ ఆకాశవాణివారి అభిప్రాయమా? ఈవిధంగానే 26వ ఫిబ్రవరిన ప్రసారమైన "ఆహ్వానము" కూడా ఇంతకుముందు ప్రసారం చేయబడిందే. ఎవరికీలేని రచనలకరువు ఈ ఆంధ్రదేశంలో ఈ ఆకాశవాణివారి పాలనే పడ్డట్టుంది. అందుకేనేమో, హోలీ ఉత్సవ సందర్భంలో ప్రసారాలైన వినోదోత్సవ కార్యక్రమాల్లో, తెలుగు రచయితలెవరూ ఆమాత్రం హాస్యరచన చేయలేరనేకావచ్చు. ఉర్దూ, బెంగాలీల తెలుగు అనుసరణను ప్రసారంచేసారు. కలగూర (కదంబ) కార్యక్రమమైనా, అయిదుగురి రచయితలచేతుల్లో పడినందువల్లకూడా మార్చి 13వ ప్రసారమైన "గిలిగింతలు" వినోద కార్యక్రమంగా బాగానే ఉందిగదా. అయితే ఆగిలిగింతల కార్యక్రమంలో కలతపెట్టింది దాశరథిగారి దాశరథీశతకపద్యాలే. వేమన పద్యాలవ్రాసి కృష్ణశాస్త్రిగారు వేమనను హాస్యప్రాయంచేసేస్తే, వారికి సమఉజ్జీగా దాశరథిగారు దాశరథీకర్తను హాస్యప్రాయం చేస్తున్నారు. హాస్యకవిత్వం వ్రాయవచ్చు, అదేమైనా కానచ్చుకాని, చక్కని భక్తిరసంగల కవితవ్రాసిన పూర్వకవిని ఇల్లా న్యూనపరచడం కలతపెట్టదా మరి! తమపేరుగానే మారిన ఇంటిపేరు దాశరథి కానచ్చు. కరుణాపయోనిధి భక్తుడికిమాత్రమే తగింది కాని హాస్యకవికెల్లా!

22వ ఫిబ్రవరిన విజయవాడనుండి ప్రసారమైన వింజమూరి శివరామారావుగారి "విశ్వామిత్ర" రచనకన్న 24వ ఫిబ్రవరినాటి "పగ" నిర్వహణ బాగుంది. "పగ" నాటిక వ్రాసినవారు గొల్లపూడి మారుతిరావుగారు. ఈమధ్య ప్రసారమైన అన్నినాటికల్లోకీ బాగున్నది ఇదొకటే. ఈవిధంగానే "నగరవాణి"లో మార్చి 12వ ప్రసారమైన దాశరథిగారి నాటికకన్నవారు "గాత్రదానం" చేసిన "అరుణరేఖలు" (18వ మార్చి – నగరవాణి) బాగుంది. అది వ్రాసినవారు ఎస్. కేశవస్వామిగారు. నాటక పూర్తికావలసినప్పుడు కాక సగం కథలో పూర్తిఅయింది. అల్లా కాకుంటే బాగుండేది. అయినా పూర్తిచేసి మళ్ళీ ప్రసారం చేయవచ్చును. ప్రసారించిందాన్నే ప్రసారించే అభ్యాసం, ఆచారమూ ఆకాశవాణివారికి కొత్త కానేకాదుగదా. అందుకని విచారించవలసిన అవసరంలేదు.

పై కార్యక్రమంలోనే 5, 6 తేదీల్లో (మార్చి) ప్రసారమైన గోపీచంద్‌గారి "లోవెలుగులు" అనే నాటిక అయోమయంగా తయారైంది. ఆ అయోమయంలో లోపల కాదుగదా, అంతట "వెలుగు" పోయింది. నాటిక నాటికగానే ఉంటే – సినీమావాళ్ళ నిందఉన్నా – బాగానేఉండేది. కాని, నాటికయొక్క పాత్రలకూ కథకూ మధ్య అక్కడికి రంగాల విభజన కావచ్చును – వ్యాఖ్యాత ఏదో నదీ గమనంతో పొత్తుకుదుర్చాలని మహా ప్రయత్నంచేస్తాడు. దానికీ కథకూ పొత్తు అనవసరమూ,అసంగతమూ అయింది. ఇంతాజేసి వెలుగుమాటే మరిచారు రచయిత. ఏదిమరిస్తేనేం? ప్రసారం కానే అయిందిగదా.

ప్రసంగాల్లో 17 వ ఫిబ్రవరిన విజయవాడ నుండి సా. నందిని కార్యక్రమంలో ప్రసారమైన వి. రాజేశ్వరిగారి "అనంతామాత్యుని రసాభరణము : గుణవిమర్శ" అన్నదీ, 29 వ ఫిబ్రవరిన విశ్వవిద్యాలయా (విద్యార్థు)లకు గాను ప్రసారమైన కేతవరపు రామకోటి శాస్త్రిగారి "ఆధునిక వచన సాహిత్యము - వ్యాసము" అన్నదీ ఆయా కార్యక్రమాలకు నప్పినట్టుగా ఉన్నవి. అభిప్రాయాల్లో వేరు వేరు దారులు ఉండవచ్చు కాని, అవి "దుష్పంథ"లు కాకపోవటం వీటి ప్రత్యేకత. విషయాన్ని రెండు ప్రసంగాలూ సరిగా అందించాయి. అసలు విషయాన్ని తప్ప భారతం ఆశ్రమవాస కథను మాత్రమే అందజేసిన ప్రసంగం రసమయి కార్యక్రమంలో మార్చి 7 న ప్రసారమైన మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి ఆశ్రమవాస పర్వంలో ధృతరాష్ట్రుడు అన్న ప్రసంగం. వ్యక్తులను బట్టి విషయాన్ని బట్టి సమయం కేటాయించడం గానీ, సమయాన్ని బట్టి విషయాన్ని - మూల భావాన్ని తెలియచేయగలంత మాత్రంగా కుదించడం కానీ లేనప్పుడు ప్రసంగాలు ఈ విధంగా ఉంటాయంటే ఎందుకుండవు ?

—సామీరి.

# సాహిత్యధార

నేను కన్యాశుల్కానికి వ్యతిరేకిని. బాల్య వివాహాలకు వ్యతిరేకిని. వర్ణవ్యవస్థలో నాకు విశ్వాసంలేదు. విధవలు వివాహం చేసుకొని సుఖిస్తుంటే నేను చూచి సంతోషిస్తాను.

ఇంతగా చెప్పుకోవలసి రావటానికి కారణం నేడభ్యుదయవాదులమని చెప్పుకొంటున్న కొందరి వాక్చాపల్యం.

సాహిత్య దృష్టితో కొనసాగిన విమర్శలకు సమాధానాలు చెప్పటం వదలిపెట్టి ఏ యే సాంఘికాభిప్రాయాలకు గురజాడ అప్పారావుగారు ప్రాతినిధ్యం వహించారో ఆయా అభిప్రాయాలకు ఆయనను కవి కాదనే వారు విరోధులనే ఒక భ్రాంతిని కల్పించుటకు వాదాన్ని పెడదారులు తొక్కించటంలో నిష్ణాతులైన కొందరు ప్రయత్నం చేశారు కాబట్టి పై విషయాలు మనవిచేసుకోవడం.

అప్పారావుగారు మూఢవిశ్వాసాలను ఖండించినారని "ముత్యాలసరము"లకు పీఠిక వ్రాసిన వారిద్దరూ ఘోషించారు. ఒకసంఘ సంస్కర్తకు ఒక తోకచుక్క కనబడ్డది. ఆయన భార్యను లేపి అనుగో కాముబాణం చూడమన్నాడు. అని తోకచుక్క ప్రాశస్త్యాన్ని వివరించాడు. "గురజాడది సంపూర్ణమైన ప్రగతిశీలదృక్పథం. తోకచుక్క అరిష్టదాయకమనే మూఢ విశ్వాసాన్ని ఖండించి.

"దూరబంధువు యితడు భూమికి
దారిబోవుచు చూడ వచ్చెను
దిగులు చెందుటదేటి కార్యము
తలతునేనిది సంఘ సంస్కరణ
ప్రయాణపతాకగా."

"అసడంలో గురజాడ అభ్యుదయ నైఖరి స్పష్టంగా గోచరిస్తుంది." అని శ్రీ శ్రీ

వ్రాశారు. పై చరణాలు మూఢవిశ్వాసాన్ని ఖండిస్తున్నవా ? తోకచుక్క అరిష్టదాయక మను కోవటం ఒకరకపు మూఢవిశ్వాసమైతే, అది దూరబంధువనుకోటం మరొకరకమైన మూఢవిశ్వాసం కాదా ? పర్యవసానంగా అప్పారాయమహాకవి ఒక మూఢవిశ్వాసాన్ని ఖండింపబోయి దాని స్థానంలో మరొక మూఢవిశ్వాసాన్ని స్థాపింప జేస్తున్నారా లేదా ? తోకచుక్క భావి సౌభాగ్య సూచక మని తలంచువాడు మూఢుడు కాకపోతే అది భావ్యరిష్టసూచకమని తలంచేవాడు మూఢుడు కానక్కరలేదు. పైగా మొదటి వాడు నిస్సందేహంగా మూఢవిశ్వాసం కల వాడు. రెండవ వాడగునా కాదా అనే దానిని చర్చించి తేల్చవలసిన అవకాశం ఉంది. రెండవ వాని మూఢ విశ్వాసానికి తోకచుక్క కనపడ్డప్పుడల్లా జనులకు అరిష్టం కలిగింది అనే జనశ్రుతి ఐనా ఆధారం. మొదటి వాడికి అదీ లేదు.

మింటిలోని నక్షత్రాలకూ భూమిపై నివసించే వాళ్ళ జీవితానికీ సంబంధం లేదనే కదా వాదం ? తోకచుక్క అరిష్టసూచక మనేవాడు మొదట ఆ సంబంధాన్ని ఒప్పుకొని తరువాత ఈ మాట అంటాడు. నువ్వు ఆ అసలు విషయాన్ని ఒప్పుకోవు. కాని అది దూరబంధువు అన్నవాడిని మూఢ విశ్వాసాలను ఖండించాడంటావు. ఇంతకంటె పొసగుదల లేని వాదం మరేదన్నా ఉంటుందా ?

ఈముత్యాల సరములోనే 'కాముబాణం' 'స్వర్గ సౌఖ్యం' మొదలైన మాటలున్నవి. కాముడనేవాడొకడున్నాడా? వాడికి బాణాలున్నవా ? స్వర్గం అనే ఒక ప్రదేశంఉందా? అక్కడి జనులంతా సుఖం అనుభస్తున్నారా? అట్లాగే 'యముని మహిషపులోహఘంటలు మబ్బుచాటున ఖణేల్ మన్నాయి.' అన్న వారు యముడనేవాడొకడున్నాడని వాడు దున్నపోతునెక్కి పాశం పట్టుకొని మన ప్రాణాలు పీక్కుపోవటానికి వస్తాడని విశ్వసిస్తున్నారా ? విశ్వసిస్తే అది మూఢవిశ్వాసం కాదా ? ఈ తోకచుక్క తర్కంలోనుండి ఇన్ని ప్రశ్నలు పుట్టుతున్నవి.

భాషలో కొన్ని శబ్దాలు కొన్ని భావాలను చెప్పుతవి. మన్మధుడు శృంగారభావానికి ప్రతీక. స్వర్గం సుఖభావానికి ప్రతీక. అట్లే తోకచుక్క అరిష్టసూచకమనే భావానికి ప్రతీకగా నిలబడిపోయింది. అది జనులకు దూరబంధువని వ్రాయటం అభ్యుదయమైతే, స్వర్గం దుఃఖభూమి అని చెప్పటం కూడా అభ్యుదయం కావలసి వస్తుంది.

అప్పారావుగారువ్రాసిన గీతాలు మిక్కిలి కొద్ది. ఈ విషయం వారి అనుయాయులకు కూడా బాధాజనకంగా ఉన్నట్టు తోస్తున్నది. "గురజాడవారి కవిత్వం సమస్తం ఒక సన్నని చిన్న సంపుటాన్ని మించకపోయిందే అని... మనం చింతించ నక్కరలేదు. గురజాడ రచనలన్నీ నష్టమైపోయి ఒక్క దేశభక్తి గీతం మిగిలినా చాలును. అతడు ప్రపంచ కవులలో ఒక్కడుగా లెక్కించదగిన మహాకవి అని ఋజువుకావడానికి" అని శ్రీ శ్రీ అభిభాషణ.

అనంతమైన విశ్వసాహిత్య చరిత్రలో ఒక గేయంయొక్క స్థానం, అది ఉత్తమమైనదే అయినా" ఎంతది అని ప్రశ్న. మహాకవి పరిమాణమునందు గొప్పదైన కావ్యము వ్రాయ వలసిన అవసరం లేదని కొందరు మాటిమాటికీ వాదిస్తున్నారు. మహాకవియైన వాని ప్రతిభాలక్షణం వీళ్ళకి తెలియదేమో అని ఊహింపవలసి వస్తున్నది. ఒక ప్రత్యేక

మైన దిశలో ఒక కొన్ని నిముషాలదాకా సాగిపోయిన బుద్ధి విలసనాన్ని మహా ప్రతిభగా లెక్కకట్టటానికి వీలులేదు. ఎవని ప్రతిభ జగత్తుయొక్క విశాల విశాల భాగాల నాక్రమించుకోగలదో, మానవ సృష్టిలోని అనంతములైన రహస్యాలకు వ్యాఖ్యానం చేయటానికి ఎవనిబుద్ధి సమర్థమై ఉంటుందో వానిది మహా ప్రతిభ. సతాం హి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః అన్న దుష్యంతు డొక రహస్యమునకు వ్యాఖ్యానము. సీతాస్పర్శచేత చైతన్యవంతుడైన శ్రీరామచంద్రు డొక రహస్యానికి వ్యాఖ్యానము. ప్రతిభ అట్లా ఉంటుంది. అందుచేతనే వాల్మీకి వ్యాసులు, కాళిదాస భవభూతులు, షేక్స్పియరు మిల్టనులు, విక్టర్ హ్యూగో, రొమేరోలా, డోస్టో వస్కీలు మహా ప్రతిభాశాలురు. వారును వారి తుల్యులును మహా రచయితలు. వారు తమ ప్రతిభానేత్రమును విస్తరించి చూస్తే జగద్రహస్య సిద్ధాంతాలు నేను ముందనగా నేను ముందని పరుగెత్తుకొని వస్తవి. అంతేకాని ఉబుసుపోకకై నాల్గు పద్యాలూ, పాటలూ గిలికిన ప్రతిమనిషీ కొన్ని విచిత్రంగా ఉన్న మాటలనుఒకచో సమకూర్చి నవ్వు పుట్టించే ప్రతిహాస్యకాడూ మహాకవి కాలేడు. ద్విత్రాః పంచషావా మహాకవయః ఇతి గణ్యంతే అనే వాక్యంలో అర్థం ఉన్నది. పైన ఉదాహరింపబడిన వాక్యాలవలె అది చాటూక్తి కాదు.

రామాయణ భారతాది ఇతిహాసాలకున్న విలువ ఈ ఒక్క గీతానికే ఉందని అంటే కొందరు ఆశ్చర్యం పొందుతారేమో! కాని ఆశ్చర్యకరమైన యథార్థం ఇది. కాలం గడుస్తున్న కొద్దీ బలం సంతరించుకొనే కొద్దిపాటి మహా కావ్యాలలో ఒకటిగా దీనిని గుర్తించక తప్పదు. ఒక తెలుగుకవి ప్రపంచానికిచ్చిన కవిత్వపు కానుక ఇది. మానవుని ఆధ్యాత్మిక యాత్రలో భగవద్గీతకుగల ప్రత్యేక స్థానం ఉంది గురజాడ కవి "దేశభక్తి""గీతానికి"అని మళ్ళీ శ్రీ శ్రీ.

ఏమంటారుమీరు ? రైలు పెట్టెల్లో మందు లమ్ముకొనేవాళ్ళు వస్తారు. అది సర్వరోగ నివారిణి అని ఒకటే అరుస్తారు. పైగా వాళ్ళ కంఠస్వరంకూడా అసహజంగా ఉంటుంది. అది సరేకాని రామాయణం "డెబ్భై పదకొండో"సారి రాస్తే అది కవిత్వం కాదనే మీరు సవాలక్షా నూటయాభైఒకటో సారి చెప్పిన "వట్టిమాటలు కట్టిపెట్టురా" "గట్టిమేలు తలపెట్టురా" మొదలైన మాటలు మహా కవిత్వమని ఎల్లాఅంటున్నారూ అన్నది ప్రశ్న. మొత్తానికి అంటున్నాము. మేమందరినీ అంటాము. మమ్మల్ని ఎవ్వరూ అనకూడదు.

రవీంద్రుడు కవి కాదని మే మనవచ్చు. గురజాడ అప్పారావు కవి కాదని ఎవ్వడూ అనకూడదు. మా ప్రజాస్వామ్యం ఇట్లాగే ఉంటుంది మరి.

—"సప్తార్చి."

# పుస్తకసమీక్ష

**యుగే యుగే**

రచన : కుందుర్తి

కాగడా ప్రచురణలు, కర్నూలు.

వెల : రూపాయి ముప్పావలా.

తెలుగు కవిత్వంలో పది సంవత్సరాలైంది వచన పద్యం అనబడే ఛందో విశేషం కూడా సముచితమైన స్థానం సంపాదించుకుని. దీన్ని హిందీవాళ్ళు ముక్తచ్ఛందం అంటారు. ఫ్రీవర్స్ వర్స్‌లిబర్ అనే మాటలకు ఏం చెప్పుకోవాలో యింకా తెలుగులో తేల లేదు. పఠాభి వాడిన వచన పద్యమన్న మాటే యింకా ప్రచలితంగా ఉంది.

ఇది ఈ మార్గంలో వ్రాయబడ్డ ఖండ కావ్యాల సంపుటి. ఒకటో రెండో ప్రాచీన చ్ఛందో మార్గానికి చెందిన రచనలు లేక పోలేదు. దీనిలో పది సంవత్సరాలుగా రచయిత అప్పుడప్పుడూ రాస్తూ వచ్చిన ఖండ కావ్యాల సంపుటి యిది.

రచయిత నవ్య కవులంటే వచన పద్యం పక్షం వహించే వారని అర్థం చెప్పాడు పీఠికలో. అందుకే విశ్వనాథషష్టి పూర్తికి అనే ఖండికలో "తెలుగు సాహిత్యం మీద యీ నవయుగ ముద్ర యింకా పడలేదు కదా" అంటాడు. అంటే ఈ ఛందోమార్గం యింకా పరిణతం కాలేదని అర్థం. ఇప్పుడు ఈ ఛందో మార్గాన రాసేవాళ్ళే నవకవులైతే మాత్రా చ్ఛందో మార్గం ప్రాచీన కావ్యమార్గం అవుతుంది. తన్మార్గ నిష్ఠులు (ఈ మధ్య శ్రీ శ్రీ మార్గీయులుకూడా మాత్రాచ్ఛందో మార్గం వెదుక్కుంటున్నారు) కూడా పాతవాళ్ళవుతున్నారు. అభ్యుదయ భావుకంగా వ్రాయబడ్డ పెన్నేటిపాట అన్న కావ్యం (దీనిలో సంప్రదాయ చ్ఛందస్సులు బహుళంగా, మాత్రా చ్ఛందస్సులు వ్యాచిత్కంగా ఉన్నవి) కూడా నవ్యకవిత్వం కాకుండా పోతుంది. ఈ వాదం పూర్తిగా ఛందో మార్గాన్ని శ్రయించి ఉంది. వచన పద్యంలో రామకథ రాసినవాడు నవ్యకవి అయి, ప్రాచీన చ్ఛందంలో ఆధునిక వస్తు కావ్యం రాసినవాడు కాకుండా పోతాడు. అందుచేత ఇది కేవలం సంబంధంగా లేని విషయం.

ఈ సంపుటిలో పద్దేళ్ల ఖండికలు ఉండటం వల్ల ఎక్కువ రచనలలో పరిణతమైన రచనా శిల్పం గోచరించడం లేదు. "తెలుగు బౌద్ధము" "వీధిమానిసి" అన్న రెండు ఖండాలలోనూ రెండవ ఖండము బాగా ఉన్నది. ఇంత చక్కగా పద్యాలు రాసే రచయిత ఒక చాదస్తంగా ఒకే మార్గాన్నే పట్టుకుని వ్రేలాడటమే నవ్యత్వమని భావించడం చాలా ఆశ్చర్యంగా ఉన్నది.

"నాగీతం" రచన "ఐ" అన్న శ్రీ శ్రీ రచనకు అనుశ్రుతిగా ఉన్నది. రచన విస్తరించింది. అయినా ఫక్కిక అదే కావడం గోచరిస్తున్నది. ఈ రకంగానే తొలి రచనలలో శ్రీ శ్రీ యొక్క రచన మార్గం గోచరిస్తున్నది.

తరువాతి తరువాతి రచనలలో "కుందుర్తి" కనిపిస్తున్నాడు స్ఫుటంగా. ఈ రచయిత వ్యక్తిత్వం రూపకాలంకారాన్ని విరివిగా వాడటంలో గోచరిస్తున్నది. అడుగడుగునా

చిత్తజల్లులాగా కొత్త కొత్త రూపకాలు తయారుచేస్తూ వుంటారు. రూపక సామగ్రి సంప్రదాయ మార్గంలోది కావడంచేత అభ్యుదయ రచయితలలో ఉన్న అయోమయం అన్న విషయం ఈయన రచనల్లో కనిపించదు. "బ్రతుకు బాధల పసిపిల్లలు" "మన శ్మాంతి మగువ" "మనసు రైలుపెట్టె" మొదలైన రూపకాలు జీవితంలో నిత్యపరిచితములైన వాటినించి గ్రహించినవి. ఈ అలంకారాల సహాయం ఈ రచయిత కవిత్వానికి క్రొత్తదనం చేకూర్చింది. ఆయన అభివ్యక్తిలో వ్యక్తిత్వం సంపాదించుకున్నాడు. ఈ విధంగా కాని ఛందో మార్గం యింకా అపరిణతంగానే గోచరిస్తున్నది.

"బ్రతుకు రోదసిమీద పరచుకున్నై చీకట్లు
భయం మెలివేసిన బ్రతుకు లెక్క లేనన్ని తాకట్లు"

ఇది "భయపడినవాడు" అనే ఖండికలోది. రచనాకాలాన్నిబట్టి చివరది (?) దీన్లోనూ ఛందస్సు అలానే ఉంది. రెండో పాదం చివర అంత్యప్రాసకోసం ఆ పాదాన్ని అంత స్పష్టంగా వ్యక్తీకరించ లేకపోవడం గోచరిస్తున్నది.

దీనిలో "ఆచార్లగారమ్మాయి" అన్నది ఒక నాటిక. ఇది వచన పద్యంలో ఉండటం ఒక విశేషం. ఈ ఛందస్సులో రాయబడ్డప్పుడు దీనిలో వచనంలో రాయబడ్డ రచనకంటే ఏదో అతీతమైన లయాత్మకమైన రచనా వైశిష్ట్యం గోచరించాలి. కాని ఈ నాటిక అంతా అలా కానిపించడం లేదు కేవలం అత్యప్రాసలు తీసేస్తే ఇది పూర్తిగా వచనంలాగా ఉన్నది. కావ్య నిర్మాణంలో కొంత విపర్యాసం తప్ప. ఇది మొదటిప్రయత్న మేమో? ఇంకా ఈ రచన శ్రీ శ్రీ రాసిన గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు అన్న రచన చదివినాక రాసిందిగా గోచరిస్తున్నది.

"చరమసంధ్యకు విడాకులిచ్చి రవిచేసిన చీకటితప్పు
చరిత్ర నిర్మించి ధరిత్రి కమలవనానికి ముప్పు"

ఇలాంటి చక్కని రచన అక్కడక్కడా ఉన్నది. ధరిత్రి కమలవనం" అన్నచోట "దరిత్రీకమలవనం"అంటే ఎక్కువ స్ఫుటంగా గోచరించే అవకాశం ఉన్నది. ఆకాశపావురం మొదలైన తప్పు సమాసాలు వాడటంవల్ల ప్రయోజనం కనిపించడంలేదు. సాధుశబ్ద ప్రయోగంలో ఈ రచయిత జాగ్రత్త మిగిలిన సవ్యకవులకంటే మించింది.

మాదిరాజు రంగారావు మొదలైన సవ్యకవులు వచన కవిత్వాన్ని తీర్చే తీర్పులో, ఈయన తీర్చే మార్గంలో భేదం ఉన్నది. ఈ రెండు మార్గాలూ పరిణతాలవడానికి యిద్దరూ తమ మార్గాలు సమన్వయం చేసుకోవడం అవసరంగా గోచరిస్తున్నవి.

మొత్తంమీద ఈ సంపుటిలో "రెండు లోకాలు" "యుగే యుగే" "విశ్వనాథ షష్ఠి పూర్తిక" అన్న రచనలు బాగున్నవి.

—దామెర మల్లారెడ్డి.

## Form IV

(see rule 8)

| | |
|---|---|
| 1. ప్రకటన జరుగు స్థలము. | ఉస్మాన్‌పురా, కరీం నగరము. |
| 2. ప్రకటన కాలక్రమము. | నెల. |
| 3. ప్రకటన కర్త పేరు, జాతి, చిరునామా. | జువ్వాడి గౌతమరావు, భారతీయుడు, కరీం నగరము. |
| 4. సంపాదకుని పేరు, జాతి, చిరునామా. | విశ్వనాథ సత్యనారాయణ, కరీం నగరము. జువ్వాడి గౌతమరావు, కరీం నగరము. |
| 5. ముద్రణ కర్త పేరు, జాతి, చిరునామా. | జువ్వాడి గౌతమరావు, కరీం నగరము. |
| 5. వార్తాపత్రిక యాజమాన్యము వహించి యున్నవారి పేరు, చిరునామా. | జువ్వాడి గౌతమరావు, కరీం నగరము. |

పై వివరములన్నియు నా సమ్మకము కొలకు, నాకు తెలిసినంతవరకు సత్యములేయని ఇందు మూలముగా జువ్వాడి గౌతమరావు అను నేను వక్కాణించుచున్నాను.

జువ్వాడి గౌతమరావు,
ప్రకటన కర్త.

---

## సవరణ

ఈ సంచికలో 'జీవునివేదన (5) విశ్వనాథ సత్యనారాయణ – రచనాప్రవృత్తి' అను వ్యాసమునకు రచయిత – శ్రీ ఘూళిపాళ శ్రీరామమూర్తి.

---